# తెలుగు
# జానపదుల సామెతలు

ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి
యం.ఫిల్. పరిశోధనా పట్టం
పొందిన సిద్ధాంత వ్యాసం



డాక్టర్ బొందుగులపాటి దామోదర్‌రావు



పర్యవేక్షణ
డా॥ వాయవి కృష్ణకుమారి
(ప్రొఫెసర్, ఉస్మానియా విశ్వవిద్యాలయం)

# TELUGU FOLK PROVERBS

BY

Dr B DAMODER RAO,
M A M Phil Ph D



రెండవ ప్రచురణ
1986

ప్రతులు : వెయ్యి

వెల : పదహారు రూపాయలు

ప్రతులకు :
రచయిత, పోస్టు గూడెం
ముస్తాబాద్-మండలం, పిన్-505 404
జిల్లా కరీంనగర్.

ముద్రణ :
శ్రీ శాంతి ప్రింటింగ్ ప్రెస్,
హన్మకొండ.

# అంకితం

నా జీవనగతికి,ప్రగతికి అనవరతం శ్రమించి, నా బ్రతుకు పూల
బాటగా మార్చాలని తపన చెంది,ఆర్థిక లోపం రానివ్వ
కుండ, మాతృ ప్రేమకు దూరమైన నాకు తల్లి
తండ్రితానై, పెద్ద చేసిన, మా నాన్న
బి. సుందర్‌రావు గారికి
తన తనువెల్ల మమకారం నింపుకొని, ఉన్న కొద్ది కాలం
మాతృప్రేమలోని మాధుర్యం మరో జన్మ వరకు
అందించి, నా ప్రగతిని, నా విద్యాభివృద్ధిని,
నిరంతరం కాంక్షించి కన్ను మూసిన
మా 'అమ్మ'కీ॥శే॥ 'అహల్య'గారికి

# ఆశీస్సులు

"జానపద వాఙ్మయబ్రహ్మ" 15_12_88

ఆచార్య బిరుదురాజు రామరాజు హైద్రాబాదు

తెలుగు జానపద విజ్ఞానరంగంలో పరిశోధనలు దినదినం వేగాన్ని, విస్తృతినీ పుంజుకుంటున్నాయి. ఉత్సాహవంతులైన యువతీ యువకులు చాలామంది తెలుగు దేశంలోను, తెలుగుదేశం బయటనూ ఈ విషయమై పరిశోధనలు చేస్తున్నారు. తమ తమ కృషి ప్రకటిస్తున్నారు. ఇది హర్షించదగిన విషయం.

డా॥ బి. దామోదరరావుగారు, ఎం.ఫిల్., పట్టాకోసం చేసిన కృషి ఈ తెలుగు జానపద సామెతలు దామోదరరావు గొప్ప ఉత్సాహశీలి జానపద విజ్ఞానం అంటే ప్రగాఢమైన అభిరుచీ, అభిమానమూ కలవారు జానపద సాహిత్య పరిషత్తుకు ఒక స్తంభంవంటివారు ఆయన కృషి పరిశోధన నిరంతరం సాగవలెననీ, మరుగున పడి ఉన్న జానపద విజ్ఞానంలోని అమూల్య విషయాలు ప్రకటించి మన భాషా సంస్కృతులకు ఇతోధిక సేవచేయవలెననీ పరాత్పరుడు ఆయనకు దీర్ఘాయురారోగ్యములు ప్రసాదించవలెనని కోరుతున్నాను.

# అభినందన

ఆచార్య పి. నారాయణరెడ్డి 8_10_88

ఉపాధ్యక్షులు హైద్రాబాదు

ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం

ఒక జాతి సాంఘిక జీవనంలోని అన్ని అంచులను సూటిగా ధాటిగా ఎత్తిచూపే ప్రక్రియ సామెత. డా॥ దామోదరరావు, ఎం ఫిల్. పరిశోధనకు ఎన్నుకొన్న తెలుగు జానపదసామెతలు చాలావరకు స్వయంగా సేకరించినవే అందులోనూ ఇంత వరకు ఆంధ్రప్రాంతాలలో తెలియని తెలంగాణా సామెతలు ఈ సామెతల్ని చదువుకొంటూ పోతూ వుంటే చిన్నప్పుడు అన్నీ నేను విన్నవే ఉన్నాయి అయితే నిజం చెప్పాలంటే వాటిలో చాలాసామెతలు విన్నవేకానీ రామరామ నాలాంటి వాళ్ళు మరచిపోతున్నవి.

కొండను అద్దంలో చూపినట్లు విస్తృత పరిధిలో వున్న తెలుగుసామెతలను విశ్లేషించి ఈ గ్రంథరూపంలో వెలువరించారు రచయిత సామెతల్లోని భాషావిశేషాలు సంగ్రహంగానైనా పరిశీలించడం బాగుంది సామెతల్లోని యతుల గురించి రాస్తూ "నియమ రహిత మగు యతులు" కొన్ని చూపించారు వీటిల్లో యతుల ఇమిడించడం చేతకాకకాదు నియ్యం కయ్యం_జానెడు, మూరెడు లాంటి పదాల అంత్య ప్రాసలతో ఆడుకోవడం.

పల్లీయ భాషలో పరమ వ్యావహారికంలో ఉండే సామెతల గురించి రాసిన ఈ సిద్ధాంత వ్యాసం గ్రాంథిక భాషలో ఉండడం ఆధునికులకు వింతగా కనిపించవచ్చు. అప్పుడు ఎలారాసినా పుస్తకంగా వెలువరించినపుడు వ్యావహారికంలోకి మారిస్తే బాగుండేది. క్రమంగా తెలుగునాట చెవిమరుగైపోతున్న సామెతలను, పలుకుబళ్ళను పరిరక్షించడంలో ఈ పుస్తకం చాలావరకు ఉపయోగపడుతుంది అందుకు దామోదర రావుకు నా అభినందన.

# శుభాకాంక్షలు

ఆచార్య నాయని కృష్ణకుమారి
తెలుగు శాఖాధ్యక్షులు
ఉస్మానియా విశ్వవిద్యాలయం.

హైద్రాబాదు
21–10–88

చిరంజీవి దామోదర్‌రావు తెలుగు జానపదుల సామెతలపైన ఎమ్. ఫిల్. పట్టానికి సమర్పించిన సిద్ధాంత వ్యాసం ఈ పుస్తకం.

సిద్ధాంత వ్యాసాలను పుస్తకాలుగా వేసుకునే జాగ్రత్త, పట్టుదల చాలమంది పరిశోధకులకు ఉండదు అవి పట్టా ప్రదానం చేసే ఉపకరణాలుగా మాత్రమే వ్రాత ప్రతులుగా, లైబ్రరీలలో మిగిలిపోతూ ఉంటాయి. ఇందుకు భిన్నంగా బి దామోదర్ రావు ఈ పుస్తకాన్ని వెలికి తేవడం హర్షించదగ్గ విషయం.

ఇదే విషయాన్ని ఈ పరిశోధకుడు పి హెచ్ డి పట్టానికి కూడా గ్రహించి డిగ్రీ తెచ్చుకున్నాడు. ముందు ముందు అచ్చుకాబోయే ఆ సిద్ధాంత గ్రంథానికి చిరు పుస్తకం ముఖ ద్వారంలాగా పనిచేస్తుంది

జన్మతః జానపదుడైన దామోదర్‌రావుకు జానపదుల మడికారంలోని సొగసులు అప్రయత్నంగానే అలవడ్డాయి. దానికి తోడు అతనికి సంబంధించిన విషయపరమైన పరిశ్రమ ఈ గ్రంథానికి వన్నె తెచ్చింది.

తెలుగు జానపదుల వృత్తి, జీవనం. వ్యక్తి జీవనం రెండూ ఈ గ్రంథంలో పరిశీలింపబడ్డాయి. తెలుగు సామెతలకూ, తెలుగుతో సంబంధం కల ఇతర భాషలలోని సామెతలకూ గల సామ్య భేదాలకు కూడ పరిశోధకుడు వివరించడానికి పూనుకున్నాడు.

జానపద భాషలో జరిగే పదార్థపరమైన మార్పులు కూడా వివరించే ప్రయత్నం చేసాడు.

రాబోయే సిద్ధాంత గ్రంథానికి పరిచయ సూచకమైన ఈ పుస్తకం వెలువరించ గలిగి నందుకు బి. దామోదర్‌రావుని నేను అభినందిస్తున్నాను,

ఈ పుస్తకాన్ని జిజ్ఞాసువుల మధ్యకు ఆహ్వానిస్తూ, గ్రంథకర్తకు శుభాకాంక్షలు తెలుపుతున్నాను.

# నా మాట

భారతీయ జనజీవన సంస్కృతికి, కల్తీలేని సెలవులు పల్లెటూళ్ళు. వారి నోళ్ళలో దాగిన భాషా సంపద సామెతలు అచ్చమైన అమాయకత్వానికి, అపారమైన అనుభవానికి, మరో పేరు జానపదులు. మన సంస్కృతి పరిరక్షణలో భాగంగా పల్లెటూళ్ళ అనుభవ సంపద భాషా రూపంలో ఉన్నా, వస్తు రూపంలో ఉన్నా. సేకరించుకొని భద్రపరచుకోవాలన్న తపనలో భాగంగా, తెలుగు సాహిత్యంలో జానపద జన జీవనానికి, భాషా సౌందర్యానికి వన్నె తెచ్చే 'సామెతలు' ప్రత్యేక అంశంగా ఎన్నుకొని, నా శక్తి మేరకు పరిశోధనా పరిధిలో కృషి చేయటం జరిగింది. నాలో పల్లవించిన, పరిశోధనాకాంక్షకు ప్రతిఫలంగా తెలుగు సామెతలు, ప్రత్యేకాంశంగా, ఎం.ఫిల్, మరియు పిహెచ్ డి. పూర్తి చేయటం జరిగింది. అందుకు అడుగడుగునా సూచనలిచ్చి ఆశీస్సులు అందించింది పర్యవేక్షణ బాధం వహించింది. మా మేడమ్ ఆచార్య నాయని కృష్ణ కుమారిగారు,ప్రోత్సాహించింది.మా గురువర్యులు ఆచార్య బి. రామరాజుగారు, ఆచార్య సి. నారాయణరెడ్డిగారు.

ఈ గ్రంథ ముద్రణకు కొంతమేర ఆర్థిక సహాయం అందచేసినది ఆంధ్ర ప్రదేశ్ సాంస్కృతిక వ్యవహారాల శాఖ, ఆశీస్సులు అందచేసినది 'జానపద వాఙ్మయ బ్రహ్మ' ఆచార్య బి రామరాజుగారు అభినందించింది. కళా ప్రపూర్ణ ఆచార్య సి. నారాయణరెడ్డిగారు శుభాకాంక్షలు తెలిపినది. కవిత్వంలో స్వర్ణ కంకణ గ్రహీత ఆచార్య నాయని కృష్ణకుమారిగారు, డా॥ రవ్వా శ్రీహరి (తెలుగు కేంద్రీయ విద్యాలయం, హైదరాబాదు), ఆచార్య డా॥ భీమ్‌సేన్ నిర్మల్ (హిందీ ఉస్మానియా విశ్వవిద్యాలయం), డా॥ లాలే (సంస్కృతం, ఉస్మానియా విశ్వవిద్యాలయం) డా॥ బి. రాంచందార్‌రావు (కన్నడ,ఉస్మానియా విశ్వవిద్యాలయం),ఇక ఈ గ్రంథం ముఖపత్రరచన చేసింది మా తమ్ముడు చి॥ రమేశ్, (బి ఎస్‌సి. బి ఇడి) ఈ గ్రంథ శుద్ధ ప్రతిని సిద్ధంచేసింది, నా పతి చి॥ రమకు వారికి నా ఆశీస్సులు. ఈ పుస్తక ముద్రణలో బాధ్యత శ్రమించిన, శ్రీ కాంతి ప్రింటింగ్ ప్రెస్ వారికి కృతజ్ఞతలు.

డా॥ బి. దామోదర్‌రావు

# విషయ సూచిక

# ఉపక్రమణిక

మానవుడు తన భావములను వెలువరించు సాధనము భాష. ఈ భాష ద్వారా మనము వెలువరించు భావములను ఎదుటి వ్యక్తులకు హృదయరంజకముగా, సూటిగా చేర్చు శక్తిగల సామెతల నెన్నియో వాడుచున్నాము, వినుచున్నాము. భావమును సంక్షిప్తముగా, సుందరముగా, సరళముగా, సూటిగా వ్యక్తీకరించు శక్తి గలిగిన ఈ సామెతలు సర్వజన వ్యవహారమున కనిపించుచుండను ఒక సామెతను కూడ ప్రయోగింపనివారు అరుదు. అందువలననే "సామెతలేని నోరు, ఆమెతలేని ఇల్లు" ఉండదని పెద్దలందురు. సామెతలు భాషయందు ప్రముఖ స్థానమును ఆక్రమించి, సాహిత్య గౌరవమును పొందుచున్నవి.

జనపదములందు నివసించువారు జానపదులు. జానపదుల వ్యవహారమున ప్రయోగింపబడి ప్రాచుర్యము పొందినవి జానపదుల సామెతలు.

జానపదుల సామెతలు, జానపదుల సాహిత్యమునందు ప్రథమస్థానము పొందియున్నవి.

సామెతలు జానపద సాహిత్యము నందు 'వచన' ప్రక్రియకు చెందినవి

జానపద వాఙ్మయ స్వరూపము !




## వ్యుత్పత్తి :

"సామెత శబ్దము 'సంభవతః' అను తద్భవము. అది సంస్కృ శబ్దమగు 'సామ్యము' నుండి వచ్చినది సామెతకు 'సామ+ఇత్=సామమ్ ఇతః'" అను వ్యుత్పత్తి అయియుండునని వివరింపబడినది

పండితులు "సహ+మతి' నుండి 'సామెత' అను పదమేర్పడినదని వి రించినారు. "అనగా వివేక పూరితమగు మాట, 'బుద్ధి ద్వారా వచ్చినది'-3 అను అ మును చెప్పినారు-

సంస్కృతము నందలి 'లోకోక్తి' అను పదమును, తెలుగున సామెత పేరు వ్యవహరింతురు. జనుల వ్యవహారమున గల మాట అను అర్థమున దీని వాడుచున్నాము.

స్వరూపము :

తెలుగు పండితులలో సామెత యొక్క స్వరూపము గురించి పలు అభిప్రాయములు గలవు.

"సమత కల్గింది సామెత"- 4అని నేదునూరి గంగాధరంగారు.

"సాటి అయినదే సాటువ"-5 అని దివాకర్ల వేంకటావధానిగారు.

"సామెత జన వ్యవహార క్షుణ్ణమైన వృత్తి"-6 అని విశ్వనాధవారు.

"సామెత జీవితానుభవములయొక్క సూత్రప్రాయ నగ్న స్వరూపము"-7 అని డా॥ బి. రామరాజుగారు.

"జాతిజీవన వైఖరి మనుష్య హృదయ స్పందన స్ఫుటంగా కనిపించే ప్రతిభా విశేషం సామెత అని డా॥ కృష్ణకుమారిగారు "-8

"అన్ని అలంకారములకు ప్రధానమైనది సామ్యత అదే క్రిమముగా సామెత అయ్యింది"-9 అని చిలుకూరివారు.

మొత్తంమీద సంక్షిప్తమైన. వివేకయుతమైన, తీక్షణమైన, సాంప్రదాయకమైన, పాచుర్యం కల్గిన అనుభవం పునాదిగా ఉండే అభివ్యక్తి సామెత" -10 అని డా॥ R V S సుందరంగారు

"సామెతలు ప్రజల జీవన సూచికలు"-11"అవి అనుభవాలపై ఆధారపడినవని" కొందరి అభిప్రాయము.

సామెతలను గురించి తమ అభిప్రాయములు వివరించిరి వీరందరి నిర్వచనములను పరిశీలించి 'సామెత' అనునది తమ భావమును సంక్షిప్తముగా, సులభముగా ఎనుటివారికి మానవ జీవితానుభవము వివరించుఉదాహృత' వాక్యము అనితెలియును.

స్వభావము :

సామెత యొక్క స్వభావమును గురించి కూడా పలువురు వివిధ అభిప్రాయములను వెలువరించినారు

సామెతలు ఆజాతి యొక్క అనుభూతి పారమ్యాన్ని ప్రతిబింబిస్తూ మహాశాస్త్రముల యొక్క సూత్రములవలె నిగూఢ రమణీయ సాహిత్య ప్రక్రియ'-13 అని విశ్వనాధవారు

సామెతలకు కొన్ని లక్షణములు గమనింపవచ్చును వానిని పరిశీలించినచో వానియొక్క సమగ్ర స్వభావము మనకు తెలియును.

అ. సంక్షిప్తత, సరళత, సామ్యత కలిగియుండుట ప్రధాన లక్షణముగా పేర్కొన వచ్చును.

ఆ జీవితానుభవమును, మానవ స్వభావమును ప్రతిబింబించుట వాని రెండవ లక్షణముగా వివరింపవచ్చును.

ఇ. ధ్వని, లయ, భాషా శైలి వాని మూడవ లక్షణముగా గమనించవచ్చును

అ. సంక్షిప్తత

సామెతలు అతి చిన్న వాక్యములందు భావములను సంక్షిప్తముగా, సూటిగా వివరించు శక్తి గలవి అల్పాక్షరముల అనల్పార్థరచన, అను పాలకుర్కి సోమన వాక్కు వాని పట్ల అన్వయించు చుండును

ఉదా: "నోరు మంచిదైతే ఊరు మంచిదైతది" ఈ సామెత యందు అనుభవ పూర్వకవృత్తాంతమును, అతి సంక్షిప్తముగ, మన నోరు మనకు మిత్రులను కాని శత్రువులను గాని చేకూర్చును, అను విషయమును సుందరముగా వ్యక్తీకరించును పరోక్షముగ నోరు అదుపున పెట్టుకొననిచో మిత్రులు సైతము శత్రువులుగా మారిపోదురని హెచ్చరింపబడినది.

సరళత

సామెతలకు గలమరియొక లక్షణము సులభముగా ఎదుటివారి గుండెలో ఇమిడి పోవు శక్తిని కలిగి యుండుట. ప్రతిక్షణము సులభముగా గుర్తించుకొనుటకు సామెతలకుగల ఈ సరళగుణము కారణమగుచున్నది.

ఉదా: "తల్లి తీరుపిల్ల" అను సామెత లోకానుభవమును అతి సులభముగా వివరింపబడినది ఎంతటి పామరునకైనా, అర్థమగు సరళత్వము ఈ సామెతలసొత్తు.

సామ్యత:

సామెతల యొక్క లక్షణము 'సామ్యము' అనగా పోలిక చెప్పబడి యుండుట. ఈ పోలిక చెప్పబడుటవలన ఎదుటి వ్యక్తికి తాను సామెత యందు వ్యక్తీకరించిన భావము సులభముగా అర్థమగును. "కొత్తంత పండుగలేదు తల్లంత దయలేదు" ఈ సామెత యందు కొత్తంత పండుగ మరియొకటి లేదను విషయము సులభముగా, సూటిగా అర్థమగుటకు తల్లికి ఉన్నట్టుగా దయ మరియొకరికి ఉండదు, అను సామ్యము చేత వివరింపబడినది.

జీవితానుభవము – మానవ స్వభావము :

సామెతలు మానవ స్వభావమును, జీవితానుభవమును ప్రతిబింబించుచుండును "ముప్పైయారు జిట్లు కలుస్తాయికాని మూడు సిగలు కల్వవు. ఈ సామెతయందు స్త్రీ, పురుషుల స్వభావము వివరింపబడినది. పురుషులలో ఉన్న ఐక్యత స్త్రీలలో అగుపింపదను విషయము వివరించినారు. అదే విధముగా "ఎత్తుకుంటే చంకకు రాదు దింపుతె దిగదు" అందు కొందరు పిల్లల స్వభావము వివరింపబడినది ఎంత చెప్పినా వినిపించుకొనని మొండి స్వభావము గల పిల్లల తత్వము వర్ణించినారు. "బలిసినోడికి ఒక్కోడు బావమర్ది" ఈ సామెత యందు బలవంతుల అహంకార పూరితమగు స్వభావమును వివరించినారు.

జాగ్రత్తగా జీవితానుభవమును పరిశీలించిన జానపదులు తమ అనుభవము లను కొన్ని సామెతలందు వివరించినారు

"తగుల్తేగాని బోసురాదు, తడుస్తేగాని గుడిసె కప్పరు"

అందు అనుభవమునకు వచ్చినగాని ఏదితెలియదు, అను అంశమును అనుభవ పూర్వకముగా చక్కని ఉపమానము ద్వార వివరించినారు దెబ్బతగిలిననే కాని నొప్పి తెలియదు, అని వర్ణించిరి

" ముందునాగలి ఎట్లబోతె ఎనుకనాగలట్లే బోతది"

ఈసామెత లోకానుభమునువ్యక్తీకరించుచున్నది. ముందువారిని గమనింయే తరువాత వారు ప్రవర్తింతురను జీవితసత్యమును చక్కని ఉపమానముతో వివరించినారు.

అదేవిధముగా లోకానుభవమున తనను నమ్మని దొరవద్ద పనిచేయుట అతని సహాయముపై ఆధారపడుట ఎంత సుఖహీనమో ఈ " నమ్మకంతక్కువ దొరను నమ్ముకుంటె సుఖంతక్కువ " అను సామెతను వివరించినారు.

ఈ విధముగా సామెతల యందు లోకానుభవమును, జీవితసత్యములను, మానవ స్వభావములను పుష్కలముగా వివరించినారు

ఇ: ధ్వని, లయ, భాషా శైలి :

వ్యంగ్య వైభవముతో అలరారు గుణము 'సామెతల' యందు కనిపించును ప్రాస, అనుప్రాసల వలన సామెతల యందు ' లయ ' తప్పనిసరిగా కనిపించును సామెత లందు ప్రయోగింపబడు ' భాష ' వ్యావహారికభాష. ఈధ్వని, లయ, వ్యావహారిక

భాషాశైలి ఉండుటవలన సామెతలు సులభముగా ప్రజల నోళ్ళయందు కలకాలము నిలచుశక్తిని గలిగి యున్నవి.

"సన్యాసి సన్యాసి రాసుకుంటె రాలెది బూడిద" ఇది ధ్వని ప్రధానముగల సామెత. ఇందు సన్యాసుల విషయము ప్రసక్తమైనను ఏమియు లేని జనుల గురించి కూడ వివరించినారు. లేనివారు ఒకరి కొకరు ఏ సహాయము చేసుకొనజాల రని 'ధ్వని' పూరితముగా వివరించిరి.

యతి :

"అల్లుడు రాలేదని, అమాసాగుతాది"
"ఉరుకు లాట, ఉత్తచాట"
"ఉన్నమాటనకు, ఉళ్ళుండకు"

ప్రాసయతి :

"కోళ్ళకుయ్యంగ బోయ్యి, కాళ్ళకాలంగ వత్తడు"
"తొందరపడ్తె-బొందల వత్తడు"

ప్రాసము

'తిని కక్కరాదు, కని పోగొట్టుకోరాదు'.
'రోసిందే రాసికత్తది'

అంత్యప్రాసము :

'ఇల్లు జానెడు, కర్ర మూరెడు'
'పదిమందిలో పనిసుఖం, ఒంటరిగ తిండి సుఖం'

ఈ విధముగా ఎన్నియో సామెతలందు యతి, అంత్యప్రాసలు, అగుపింప గలవు.

ఈ విధముగా ప్రధాన లక్షణములతో పాటు వివేకమును, విజ్ఞానమును కలిగి ఉండి, సూటిగా, తీక్షణముగా ఎదుటి గుండెను చేరు శక్తి గలిగి ఉండుటకూడ, సామెతల ఇతర లక్షణములు.

ప్రయోజనములు :

సామెతలు, సంస్కృతిని, సంప్రదాయమునందలి, వివిధ స్వరూపములను తరతరముల నుండి ప్రతి తరమునకు అందించు శక్తిగలవి. అవి జనుల సామాజిక,

ఆర్థిక, ధార్మిక రాజకీయ జీవిత విధానములను, ప్రతిబింబించుచుండును. వివిధ వ్యక్తుల మనోభావములు విజ్ఞానము, వివేకమును వివరించుచుండును.

మనము స్వీకరించు "ఆహారమున ఉప్పునకు గల ప్రాధాన్యమే సంభాషణమున సామెతకును కలదు" 14 సామెతల వలన సంపూర్ణ మానవ జీవితమును గమనించి వాని అర్థము చేసుకొనుటకు వీలగును, సామెతల యందలి భాషను గమనించినచో, ఎన్నియో భాషా విశేషములు తెలియగలవు.

## వివిధ భాషలలో సామెతలు :

మానవ జాతి అంతయు ఒకటే, కాని వారి స్వరూప స్వభావములందు భిన్నత గోచరించుచుండును అదే విధముగా వారి ప్రాంతీయ వ్యవహారము లందు, ఆచారములందు, విశ్వాసములందు, రాజకీయ, ఆర్థిక జీవితములందు భిన్నత అగుపింప వచ్చును. కాని మొత్తము ప్రపంచ మందలి సమస్త మానవజాతి మూల స్వభావము మాత్రము ఒక్కటిగనే అగుపించు చుండును. అందువలననే ప్రపంచమందలి అన్ని సామెతలలో భావమునందు. వాని మూల స్వభావము నందు, అభిప్రాయ ప్రకటనా పద్ధతియందు చాల సామ్యము అగుపించు చుండును వారి వారి ప్రాంతములను బట్టి. భాషలనుబట్టి. చుట్టునున్న పరిస్థితి ననుసరించి ఉపమానములు వాడి, భావ మును వివరించుట యందు మాత్రమే కొంత భిన్నత కన్పించు చుండును.

ఇరుగు పొరుగు భాషలలోని కొన్ని సామెతలు 1) వ్యక్తీకరణము నందును, భావము నందును, ఉపమానములను వాడుట యందును. ఒకే విధముగా ఉండి కేవలము భాషా భేదము మాత్రమే ప్రధానముగా కలిగి యుండును. దీనికి ఆ రెండు ప్రాంతముల యందలి జనుల మధ్య గల సాన్నిహిత్యము ప్రధాన కారణము.

ఉదా :

"ఒకనాటి భాగోతానికి, మూతి మీసాలు గొరిగించు కున్నట్లు" (తెలుగుసామెత)
"ఒందుదివస ఆటక్కె మీసె బోళిసబేకె" (కన్నడము)

"ఒరునాళ్ కూత్తుక్కు మీసైమెచ్చిరైక్కలామా" (తమిళము)
"ఒరునాళ్ కూత్తిను మీశచెరక్కేణమో" (మళయాళము)

ఇవి అన్నియు అభివ్యక్తియందును, భావమునందును సామ్యత గలవి. కేవలము భాషయందు మాత్రమే భిన్నత్వము గలవి

2) మరికొన్ని సామెతలందు ఉపమానములు వాడుటయందు భిన్నత్వమును, భావమును ఏకీకరించుట యందు సామ్యతయు అగుపించవగలవు

ఉదా "మొగన్ని కొట్టింది, మొరపెట్టింది" (తెలుగు)

దీనిని ఇతర భాషలలో వివిధములగు ఉపమానములతో వివరించినారు.

"ఉల్టా చోర్ కోత్వాలీకో డాంటే" [హింది]
[దొంగ తలారిని తిట్టును]

"చోరాచ్యా ఉల్ట్యా బోంబా" [మరాఠీ]
(దొంగతనము చేసి అరిచెను)

ఇట్టి సామెతలు పలు భాషలందు గలవు

3) "ఒకే మూలకథ" ఆధారముగ వెలసిన సామెతలు పలుభాషలందు వ్యాపించ వచ్చును

ఉదా: "అందని ద్రాక్ష పుల్లన"
"గ్రేప్స్ ఆర్ సోర్" (ఆంగ్లము)
"అంగూర్ ఖట్టేహై" [హిందీ]

"నరిగె ద్రాక్షి హుళి" [కన్నడము]
(నక్కకు ద్రాక్ష పుల్లన)

భారత రామాయణ గాథల వలన కూడ, పలు భాషలందు, వానికి సంబంధించిన సామెతలు, పోలికలు కలిగి వ్యాపించినవి

## సామెతల పుట్టుక

సామెతల పుట్టుకపు కొన్ని కారణములను ఊహింప వచ్చును. అవి మానవులు తమఅనుభవములను వ్యక్తీకరించుసందర్భమున ఎవరోఒక వివేక వంతుడు సుందరముగను, సంక్షిప్తముగను ఒక ఉపమాన పూర్వకమగు మాటతో సంఘటనమును వివరించును ఆ మాట రానురాను అందరినిఆకర్షించి, ప్రాచుర్యము పొంది, పలుగురి నోట నిలచిపోయి'సామెత'గాగుర్తింపబడును. కొందరు పండితులు,కవులు, వేదాంతులు తమ రచనము లందు విశిష్టమగు వాక్యములను, హితవులను వివరింపగా అవి ప్రజల నోళ్ళయందు నిలచి సామెతలుగా మారును.

మన ప్రాచీన కాలమువందలి గాథలు, పురాణములు లోగల ఎన్నియో సుభాషితములు, సామెతల పుట్టుకకు కారణము లైనవి

మానవజాతియంత ప్రాచీనతను సామెతలు కూడ సంతరించుకొనినవి. మానవుడు తాను భాషించుట నేర్చుకొనిన నాటినుండి 'సామెతలు' వాడి యున్నాడని కాని మొదట ఎప్పుడు ఎవరి చేత అవి సృష్టింప బడినవో తెలియదని"15 అభిప్రాయము.

మొత్తముపై సామెతల పుట్టుకకు మూడు ప్రధాన కారణములు ఊహింపబడినవి. అవి,

1) ప్రాచీన కథలు, గాథల వలన కొన్ని సామెతలుద్భవించుట.
ఉదా: "రామాయణమంతా విని రామునికి సీతేమైతది అన్నట్టు"

2) అనుభవ సంఘటనలు.
ఉదా: "కాటికాడ ఉన్న మాటలు, కూటికాడరావు"

3) మహా పురుషుల, పండితుల వాక్కులు.
ఉదా: "వోరు మంచిదైతే, ఊరు మంచిదైతది"

## వర్గీకరణ :

సామెతలను వర్గీకరణ చేయుట యందు పలువురు పండితులు భిన్నాభి ప్రాయముల వివరించినారు.

1) కేవలము అకారాదిగా సామెతలను పట్టికలలో పేర్చి వివరించుట.

2) సామెత అందలి వస్తువును అనుసరించి వర్గీకరణము చేయుట.

3) వర్ణింపబడిన వృత్తి వ్యాపారాది విషయములను అనుసరించి చేయుట

4) సామెతలందు గల భాషా విశేషముల ననుసరించి భాషాపరమగు వర్గీకరణ చేయుట

కొన్ని సామెతలు వీనిలో ఏదో ఒక వర్గమునకు చెందక ఒకటి లేక రెండు వర్గములందు సైతము చేరిపోవును.

ఉదా "ఎద్దులె తింటదు మొద్దోలె పంటదు"

ఈ సామెతను 'ఎద్దు'ను ఉపమానముగా స్వీకరించుట వలన, వ్యవసాయ సంబంధమగు విషయమున చేరిపోవుచుండగా ఒక వ్యక్తితో సామ్యము నిరూపించుట. ఆ వ్యక్తి మనస్తత్వమును వివరింపబడు చుండుటచేత మనస్తత్వ సామెతలందు కూడా చేరిపోవును

మార్గరెంట్, ఎమ్ బ్రెంట్ అను పాశ్చాత్యుడు సామెతలను భాషా పరముగా ఎనిమిది విభాగములని నిరూపించినాడు 16 అవి.

1. పూర్తి వాక్యములు 2 విద్యావంతుల సంగ్రహ వాక్యరూపంలు 3. అనుప్రాసములు 4. అసంపూర్ణ వాక్యములు, క్రియాత్మకములు 5. క్రియారహితములు 6. ఉపమానములు 7. ఉదాహృత వాక్యము 8. ఆధునిక పరసోక్తులు. ఈ విభజనము భాషాశాస్త్ర పరమగునది.

శ్రీమతి డా॥ నాయని కృష్ణకుమారిగారు సామెతలను మూడు వర్గములుగా విభజించినారు 17

1. బంధు సంబంధి 2 వ్యక్తి వివేచనా సంబంధి 3. సత్య విషయ సంబంధి.

డా॥ యస్ యస్. దక్షిణామూర్తిగారు సామెతలను వర్ణవిషయము ననుసరించి వర్గీకరించుటఉత్తమమని భావించి వారు ఈ పద్ధతిని స్వీకరించిరి. అందు సామెతలను నాలుగు ప్రధాన భాగములుముగా విభజించినారు 18అవి

1. ధార్మికములు (ధర్మము,భక్తి, భాగ్యము, విశ్వాసము,ఆచారములు శకునములు, పౌరాణికములు, జీవనదర్శనము మొ॥

2. నైతికములగు సామెతలు: (అర్థనీతి, రాజనీతి, మైత్రి, పరోప కారము, ఆదర్శజీవనము, తదితరనీతికి సంబంధించినవి)

3. సామాజికములు: (సమాజము, వ్యక్తి, సృష్టియందు మానవుడు, జాతి, స్త్రీ పురుషులు మొదలగు విషయములు కలవి)

4. శాస్త్రపరములు' అందు మరినాలుగు చిన్నవర్గములు కలవు.

i. శిక్షజ్ఞాన సంబంధములు.

ii కృషి (వ్యవసాయము) వర్ష విజ్ఞానము (ఋతువాతావరణములు, భూమి తదితరములు, పశువులు)

iii మనస్తత్వములు (సాధారణములు, విశేషములు)

iv. తదితరములు (అతిహాస సంఘటనములు, వ్యక్తి ప్రధానములు, స్థల సంబంధము)గా వివరింపబడినవి.

ఈ విధముగా పలువురు పలువిధములుగా విభజనము గావించిరి. అందు మార్గరెట్‌గారి వర్గీకరణము భాషా పరమగునది, తక్కిన పన్నియు సామాజిక జీవనమునకు సంబంధించిన వర్గీకరణమున చేరిపోవును.

కృషిచేసినవారు :

సామెతల గురించి ప్రత్యేకమగు పరిశోధనలు మన తెలుగు భాషలో కన్న మిన్నగా కన్నడ, హిందీ,రాజస్థానీ భాషలయందు జరిగినవి. పాశ్చాత్య దేశములందు సామెతల గురించి పరిశోధన చేయుటకు, సేకరణ జరుపుటకు ప్రత్యేక సంస్థలు కలవని తెలియుచున్నది. తెలుగు సామెతల సేకరణ యందు కృషి జరిగినను సామెతల గురించి సమగ్రపరిశోధనము మాత్రము జరుగలేదు.

**తెలుగు సామెతలు తొలుత సేకరించినది ఎం. డబ్ల్యు. కార్. తర్వాత కాలమున పందిరాజు చంపతిరావు గారు విశేష కృషి చేసిరి.**

తర్వాత జానపద సాహిత్యము • సామెతల సేకరణమున అమూల్యమగు సేవ చేసినవారు నేదునూరి గంగాధరంగారు. వీరువేలాది సామెతలు సేకరించి ఉపయుక్తమగు పీఠికలతో 'పసిడిపలుకులు,' 'వ్యవసాయ సామెతలు' అను గ్రంథములు ప్రచురించినారు చిలుకూరి నారాయణరావుగారు •"సామెతలను జాగు చేయుడమనేది చాల కష్టసాధ్యమైన పని అయినప్పటికి 150 000 సామెతలను నేను జాగు చేసాము"20 అనిరి సేకరణ విషయమున వారు అపారమగు కృషి గావించినారు. శ్రీ టేకుమళ్ళ కామేశ్వరరావు మొదలగు ప్రముఖులు సామెతల సేకరణకు కృషి గావించిరి.

## సంస్థలు •

సామెతలను గురించిన గ్రంథము లెన్నియో తెలుగున ఉపయుక్తమగు పీఠికలతో సంస్థలచే ప్రచురింపబడినవి. అందు నేదునూరివారి 'పసిడి పలుకులు' విశ్వనాథ పీఠికతో అకాడమీ ప్రచురణగా వెలువడిన 'తెలుగు సామెతలు' డా॥ దివాకర్ల వేంకటావధాని, సంపత్కుమారాచార్యుల పీఠికలతో తెలుగు అకాడమీ ప్రచురించిన 'తెలుగు సామెతలు'( 2 ముద్రణలు) చెప్పుకో దగినవి. అవిగాక వివిధ పత్రికలయందు సామెతలను గురించిన వ్యాసము లెన్నియో ప్రచురింపబడినవి ముఖ్యముగా ఆంధ్ర పత్రిక, గృహలక్ష్మి, స్వతంత్ర, భారతి, మొదలగు పత్రికలయందు ఎందరోప్రముఖులు సామెతల గురించి వ్యాసములు రచించిరి.

## జరుగవలసిన కృషి :

తెలుగు సామెతల గురించి ఇంత వరకు జరిగిన కృషిని గమనించి, ఇతర భాషల సామెతల గురించి జరిగిన కృషిని పరిశీలించినపుడు మన 'సామెత'ల గురించి శాస్త్రబద్ధమగు పరిశోధన జరగలేదనియు, జరిగిన కృషి సేకరణమునసనే తప్ప పరిశోధనమున తక్కువయే అని చెప్పక తప్పదు

సామెతలు నిత్యనూతనములు, మానవ జీవితాను భవములను అనుసరించి మార్పు చెందుట, లేదా నూతన రూపములతో వెలయుట జరుగుట వలన సేకరణ కృషి అనునిత్యము సాగవలయును.

జానపదుల వ్యవహారమున ఎన్నియో సామెతలు కలవు వీనిని ప్రత్యేకముగా సేకరించుట అవసరము. జానపద సాహిత్య సేకరణమున వీనికి ప్రాధాన్యత ఇచ్చుట సమంజసము. లేనిచో తదితర జానపద ప్రక్రియలకు వలె తరములు మారుకొలది 'జానపదుల సామెతలు' కాలగర్భమున కలసి పోవును.

వా పరిశోధన :

'జానపదుల సామెతలు' అను ఈ పరిశోధన వ్యాసమున, జానపదులు, సామెతల సృష్టియందు పండితులకు తీసిపోరనియు, వారి సహజ శైలితో, సారవంతమైన అభిప్రాయములను సూక్ష్మముగా వర్ణించిరనియు వివరింప బడినది. 'సామెతలు, మానవ మనస్తత్వ విమర్శనములు' మానవ జీవిత ప్రతిబింబములు,' అని నిరూపించబడినది. తెలుగు జానపదుల జీవిత విధానము చిత్రింపబడటము, ఈ సామెతలందు గమనించవచ్చును.

# సాంఘిక జీవనము

విభిన్న స్వరూప స్వభావముల, వ్యక్తుల, కలయికను సంఘముగా నిర్వచింపవచ్చును సంఘమును పలువురు పలువిధములుగా నిర్వచించిరి.

'ప్రపంచములోని మానవులందరి మధ్య కొన్ని సంబంధము లేర్పడి యుండుటచేత మానవకోటి అంతయు కలసి ఒక సమాజమని చెప్పదగి యున్నది-1.

'అన్యోన్యాశ్రయములగు కొన్ని కుటుంబముల సమూహమే సమాజము'2

పురాతన కాలమున మానవులందరు విడిగా జీవించియున్నను, కాల క్రమమున తమ ప్రయోజనములను ఆశించి గుంపుగా జీవించుటకు అలవాటు పడిరి క్రమముగా బుద్ధి వికసించుకొలది గుంపుగా జీవించు ఈ స్వభావము సంఘ జీవనమునకు పునాదిగా మారినది గుంపుకన్నను, సంఘముయొక్క నిర్వచనము సమగ్రమైనది కట్టుబాట్లు నియమములు సంఘమునందు

కన్పించినట్లు గుంపునందు కన్పించవు పాశ్చాత్య సామాజిక శాస్త్రవేత్తలు "పరస్పర సంబంధములుగల వ్యక్తుల కలయికయే "గుంపు" అని నిర్వచించిరి"3.

అటువంటి కొన్ని 'గుంపుల' సమాహారము 'సంఘమని' వివరించిరి-4.

మానవులందరి సమైక్య జీవన విధానము వారి సంఘమునకు పునాది. "సంఘమున కుటుంబములు. గ్రామీనజనులు, వంశములు. సామాజికులు అందరును కలసిపోయి యుందురు"5.

మానవుడు అనాదిగా సంఘజీవి అతడు తనతోటివారందరితో కలసి తమ ప్రయోజనముల ఆశించి ఏర్పరచుకొనిన సంఘమునందు భాగస్వామి. అందువలన సంఘమునకు దూరముగా అతనిజీవితము అనూహ్యము. "సంఘ జీవితమును అంగీకరించనివారు జంతువులో లేదా దైవస్వరూపులో కావలయునని", "మానవుడు ఒక సామాజిక జంతువు"6 అనియు ప్రముఖ తత్వవేత్త అరిస్టాటిల్ పండితుడు వివరించినాడు

సంఘమున మానవుని ఉనికిని వివరించుచు ప్రముఖ సామాజిక శాస్త్ర వేత్త మానిపర్ పండితుడు "మానవుడు తన అన్ని అవసరములకు సంఘము పైన ఆధారపడుటయు అది అందించు సేవలను స్వీకరించుటయు తప్పదని"7 వివరించినాడు

మానవుడు సంఘమునకు వెలుపల జీవించిన యెడల అతనికి మనో వికాసము అలవడదు. మనిషి తన తోటివారినుండి, తన పరిసరములనుండి, ఎన్నియో విషయములను నేర్చుకొని మానసిక పరిణతను సాధించును. అందు వలన వ్యక్తికి సమాజముతో సన్నిహిత సంబంధము కలిగియుండుట సర్వ సామాన్యము.

"మానవ జీవితము పూర్తిగా ప్రతిబింబించు ప్రతిచోట సంఘము గలదను"8 అభిప్రాయమును శాస్త్రవేత్తలు వివరించిరి.

ఈ విధమగు నిర్వచనములు, అభిప్రాయములు మానవులు సంఘ మందు నివసించుట తప్పనిసరి అనియు, వారితో సంఘమునకు సన్నిహిత సంబంధము కలదనియు వివరించుచున్నవి.

సంఘమందు జీవించు మానవులు సంఘ సూత్రములకు, నియమము లకు, కట్టుబడి జీవింపవలసివచ్చును. అట్లు జీవించు జీవితము వారి సాంఘిక జీవనము.

మాసివర్ పండితుడు "ఆచార వ్యవహారములు, కార్యవిధానములు, అధికారిక శాసనములు, అన్యోన్య సహాయము, మానవుల కూటములు, వైరుధ్య ములు మానవుని ప్రవర్తనపై విధింపబడు ఆంక్షలు, స్వతంత్రవర్తనము మున్నగు అంశములు"9 సాంఘిక జీవనమున భాగములని వివరించినాడు.

శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు "సాంఘిక చరిత్ర, మానవ చరిత్ర, ప్రజల చరిత్ర అది మన స్వంత కథ, అది మన జనుల జీవనమును ప్రతి శతాబ్దము నందెట్లుండెనో తెలుపునట్టిది. అది మన ముత్తాతల చరిత్ర వారి యిండ్లు, వారి కట్టు, వారి తిండి, వారి ఆటలు, వారి పాటలు, వారుపడిన పాట్లు, వారు మనకిచ్చిపోయిన మంచి చెడ్డలు"10 అని వివరించిరి

మానవుల సామాజిక జీవనమును వారి అనుభవములందు, అభిప్రాయ ములందు, కళా సాహిత్యములందు గమనింపవచ్చును. అనుభవములను, అభిప్రాయములను సూటిగా వ్యక్తీకరించు 'సామెత'ల యందును సమగ్ర ముగా సాంఘిక జీవనము పరిశీలింపవచ్చును.

సామెతలందు ప్రతిబింబించు సాంఘిక జీవనమును కొన్ని విభాగ ములుగా పరిశీలింప వచ్చును. అవి 1. మానవుని పుట్టుక, 2. విద్య 3. వివాహము, 4 సంతానము, 5 స్త్రీ-పురుష ప్రతిపత్తి, 6 కులవ్యవస్థ, 7. వృత్తులు, 8. ధనిక పేదభేదములు, 9 మతము, 10 ఆచారములు, 11 పండుగలు, 12. శకునములు, 13. నమ్మకములు, 14 నీతి నియమములు 15 మృత్యువు.

## మానవుని పుట్టుక :

మానవుని జీవితము పుట్టుకతో ప్రారంభింప బడును.

జానపదులు తమ సామెతలందు ప్రసవమును గురించి, మానవుని పుట్టుక గురించిన అంశముల ప్రసక్తిగావించిరి కొన్ని సామెతలందు 'ప్రసవము' గురించిన అంశమును పోలికగా స్వీకరించి లౌకిక జీవమునందలి వ్యక్తుల స్వభావమును వివరించుట అగుపించును.

"బిడ్డ నీళ్ళాడక అల్లునిమీద మొత్తుకున్నదట"

ఈ సామెతన, ప్రసవప్రసక్తి యున్నను దీనిని లౌకిక జీవనమున కొందరు వ్యక్తుల స్వభావములను వివరించుటకు వినియోగింతురు

"మంచమున్న తాడ్నే నీళ్ళాడుతా"

"అరుగుర్ని కన్నమ్మకు ముగ్గుర్ని కన్నమ్మ తినక నేర్పింది"

వంటివి ప్రసవసంబంధ సామెతలు, జానపదులు సామెతలలో 'పుట్టువు'కో లికగా మానవతత్త్వాల్ని వివరించినారు

"పిల్లపుట్టక ముందె కుల్ల కుట్టినట్లు"

"అలులేదు చూలులేదు కొడుకుపేరు గోవిందం"

ఈ సామెతలయందు అసలులేని దానిగురించి అవివేకము వలన ఎన్నిటినో ఊహించువ్యక్తుల తత్త్వమును విమర్శించుట పరోక్షముగాగలదు.

చదువు .

మానవునకు పుట్టకతో ఆలోచనా పరిధి విస్తరింపదు. సమాజమందు తోటివారి మధ్య తిరుగుచు కొంత పరిజ్ఞానము సాధించును మరికొంత విజ్ఞానము 'చదువు' వలన పొందును. చదువులేనివారు పశువులతో సమానమని వాడుక. మనిషి వివేక సంపన్నతకు, 'చదువు' ఎంతో ప్రాధాన్యము వహించుచున్నది.

విజ్ఞులు చదువును గురించి ' విద్య కల్పవృక్షము వంటిది. అది ఎల్ల కోరికలనొసంగును తల్లివలె రక్షించును, తండ్రివలె హితమును బోధించును. భార్యవలె దుఃఖమును పోగొట్టి ఆనందింప చేయును, దిక్కులన్నిటను కీర్తి వ్యాపింప చేయును. ఐశ్వర్యము నొసగును"11, అని వివరించిరి.

మానవజీవితమున శిశువునకు ఐదవఏడు ప్రారంభమున "అక్షరాభ్యాసము" జరిపి అతని చదువునకు మార్గము చూపుదురు వ్యక్తిజీవితమున ప్రధానమైన చదువును గురించి వెలసిన సామెతలు గలవు

"చదువు చారెడు బలపాలు దోసెడు"

చిన్ననాడు చేతిలో పలక బలపము తీసుకొని బడికివెళ్ళు విద్యార్థిని గురించి చెప్పినట్లుగా అగుపించు ఈ సామెతయందు కొద్ది చదువుకు పెద్ద మొత్తాలు వెచ్చించే వ్యర్థ విద్యార్థుల ప్రవర్తనను వ్యంగ్యముగా, మృదువుగా విమర్శించిరి. అనవసర ఖర్చులు తగ్గించుకొని విద్యాభ్యాసము చేయవలయుననియు విద్యకు కావలసినది శ్రద్ధయేకాని వ్యర్థాడంబరము కాదనియు వివరింపబడినది.

అదే విధముగా, చదువు ప్రయోజనము, విజ్ఞానము, వినయము సంతరించుకొనుటయనియు, ఉన్నతముగా ఉత్తమముగా,సంస్కారవంతునిగా జీవించుట అనియు ఈ "చదువుకొన్నోనికన్న చాకలోడు నయం" అను సామెతయందు వివరించిరి. చదువుకొనినవాడు ఉచితానుచిత పరిజ్ఞానము అలవర్చుకొని ప్రవర్తించవలెను. కాని చదువులేని అమాయకులవలె వర్తించరాదని చెప్పిరి. అట్లు ప్రవర్తించు వారికన్నను, కొన్ని విషయములయందు ఆ అమాయకుల ప్రవర్తనమే మెరుగుగా ఉండునని వ్యంగ్యముగా గుర్తు చేసినారు

చదువు యొక్క పరమార్థము వివేక సముపార్జన. కాని కొందరు చదివిన చదువును సార్థకము చేసికొనక, అవివేకముగా ప్రవర్తింతురు వారిని గురించి "చదివేస్తే ఉన్నమతి పోయింది" అను సామెతను వివరించిరి

వివాహము .

విద్య ముగిసిన పిదప మానవుని జీవితమున రెండవ ప్రధాన ఘట్టము, గృహస్థుడగుట. దానికి వివాహమను క్రియను మన సంఘము నిర్దేశించినది. మానవుల జీవితమునందు వైవాహిక సంబంధమునకు చాల ప్రాముఖ్యము కలదు ఆదికాలము మానవులయందు ఈ వ్యవహారము లేకపోయినను వీరు క్రమ క్రమముగా, విజ్ఞులుగా మారి సంఘ జీవితము ఏర్పరచుకొనిన నాటి నుండి ఈ తంతు దాదాపు ప్రతిజాతియందును ప్రతిదేశమందును జరుపబడుచున్నది.

వివాహమనునది స్త్రీ-పురుషుల మధ్యగల ధర్మబద్ధమగు సంబంధముగా వివరింపవచ్చును. ఈ బంధము శాశ్వతమగునది.

హైందవ సంస్కృతి వివాహమును మత విశ్వాసముగా అంగీకరించినది "వివాహము కేవలము సాంఘిక ధర్మము మాత్రమే గాక మత పరమగునది కూడా"12

వివాహము యొక్క లక్ష్యము సంతానోత్పత్తి. దాని మూలమున మానవుల సంతతి శాశ్వతముగా నిలచుటకు మార్గమేర్పడుటయే గాక, సమాజము శాశ్వతముగా నిలచి ఉండుటకు కూడ సహకరించును.

"వివాహమొక పవిత్ర సంస్థ"13. అని మనువు అభిప్రాయము. ఈ విధముగా మన హైందవ సంప్రదాయమున, వివాహమునకు ప్రత్యేక తలు, నియమములు ఎన్నియో కలవు. అవి వివిధ వర్ణముల వారికి వివిధ పద్ధతులలో కలవు. కాలానుగుణముగా కొన్ని మార్పులు, చేర్పులు జరిగినను మూల సిద్ధాంతముల ఆచరణ కొంతవరకు, కొందరియందు పక్రమముగా కనిపించును

మన హైందవ సంస్కృతి నిర్ణయించిన వివాహ వ్యవస్థను గురించి జానపదులకు కొన్ని అభిప్రాయములు, విశ్వాసములు గలవు. వీనిని వారు తమ సామెతలయందు వివరించిరి

వివాహము దైవ నిర్ణయమని, అనుకూలమగు దాంపత్యము సిద్ధించుట అనునది అదృష్టాదృష్టములకు సంబంధించి యుండునని మన విశ్వాసము. ఈ విశ్వాసము జానపదులయందు ఎక్కువగా అగుపించుచున్నది

ఈ "కుడవబోయినా కూడబోయినా అదృష్టం కావాలి"అను సామెతలో ఈ సత్యము వివరింపబడినది. అందు ఎవరియింటికైనా భోజనమునకు వెళ్ళినను, లేదా. ఎవరితోనైనా సంబంధము అందుకొనుటకును, ఎంతో అదృష్టము కావలయునునని దాని ప్రభావమునసనే ఉత్తమ సంబంధము ఏర్పడునని వివరింపబడినది.

వివాహమున ఎవరి స్థితిగతులకు తగిన సంబంధమును వారు నిశ్చయించుకొనుట పరిపాటి. ఈ విషయమే "కయ్యానికైనా వియ్యానికైనా సమానముండాలి" అను సామెతయందు స్పష్టముచేయబడినది ఎవరితోనైనా పోట్లాడవలసి వచ్చినను, సంబంధము కలుపుకొనవలెనన్నను సమానస్థాయి అవసరమని. దానివలన ఎక్కువ చిక్కులు ఏర్పడవనియు, తమ స్థితికి మించినవారితో వియ్యమందినచో బలహీనుడు బలవంతునితో కయ్యానికి సిద్ధపడినట్లుండునని ఎంతో లోకానుభవముతో చెప్పిరి. అంతియేకాక అరువురు

సమానముండినచో. ఒకరు మరియొకరికి లొంగియుండుట వలన ఉదయించదు. అధికారము ప్రదర్శించు అలవాటుకు తావులేదు, అను సత్యమును వారు వివరించిరి.

వివాహము నిశ్చయించుటకు ముందు వధూవరులు కులనియమము లను పాటించవలసి యుండెడిది. ఎవరి కులమునకు చెందిన సంబంధమును వారు చేసుకోవలయునని తదితర కులములతో సంబంధములను నిషేధించినారు. అదే విధముగా సగోత్రికుల మధ్య ఒకే కులము వారయినను వివాహము జరుగరాదని కూడ నియమము కలదు

"ధర్మబద్ధమగు వివాహమెప్పుడును సగోత్రికుల మధ్య కాకుండా సవర్ణుల మధ్యనే జరుగవలెయును"14 అని మనుస్మృతి వివరించుచున్నది

ఈ నియమములను జానపదులు వివాహ విషయమున పాటించినారు.

'పిలిచి పిల్లనిస్తానంటె కులం తక్కువన్నాడు' అను సామెత యందు వారికి 'కులము'పై గల నమ్మకము, దానికి వివాహ కార్యమునందు గల విలువయు తెలియుచున్నది.

ఆ రోజులలో వరుని పక్షమువారే 'పిల్లను' కోరి చేసుకునేవారనియు, తమ కులమునకు చెందిన వారినే ఎంత వేసారి అయినను స్వీకరించెడి వార నియు తెలియును.

ప్రతి గృహమున యుక్తవయస్సు వచ్చిన సంతానమున ముందు పెద్ద వారికే వివాహము జరుపవలయునని నియమము కలదు అది సహజము. సాంఘిక న్యాయముకూడా ఈ విషయము విస్మరించువారిని, అపకతవక పనులు చేయువారిగా లోకము భావించును. కావుననే "మొదటిదాన్కి మొగుడు లేడుగాని కడదానికి కల్యాణం" అను సామెత జనించినది

అదే విధముగా. వివాహమునకు వయస్సును నిర్ణయించినారు. తగిన వయసు వారికి వివాహము చేయుట శ్రేయస్కరము 'వయసు పోయినంక లగ్గమెందుకు, ఆకలి పోయినంక అన్నమెందుకు' అను సామెత ఈ విషయ మును స్పష్టము చేయును.

కొన్ని కులముల యందు స్త్రీలు తిరిగి వివాహము చేసుకొను ఆచారము కూడ కలదు. ఇది ముఖ్యముగ శూద్ర జాతుల యందు ఎక్కువగా కనిపించు చున్నది. మొదటి వివాహము రద్దుచేసికొని గ్రామ పెద్దల సమక్షమున 'యిడుపు కాగితం' పెట్టుకొందురు. అనగా అది విడాకుల పత్రమువంటిది. తదుపరి ఆ దంపతులు విడిపోయి తమకు నచ్చిన మరొవ్యక్తిని వివాహము చేసికొందురు. దీనినే 'మార్మానం' అందురు.

"మంది మాటలు పట్టుకొని మార్మానం పోతే మళ్ళొచ్చేసరికి ఇల్లు కాలిపోయే" అని ఒక చపలచిత్తపు ఇల్లాలుకు 'మార్మానం' వలన జరిగిన అపకారమును వ్యంగ్యముగా వివరించిరి.

వివాహమును గురించిన నమ్మకములు ఎన్నియో గలవు.

వివాహము అగుట వలన సంతోషము చేకూరి ఆ దంపతులు లావు అగుదురని ఒక విశ్వాసము. ఈ "తలువవు పడగానే తన్నేంత బలుత్తరు" అను సామెతయందు ఈ విశ్వాసమును గమనింపవచ్చును.

"గతికితే అతకదు"

ఈ సామెతయందు వివాహ సంబంధము నిశ్చయించుటకు వెళ్ళినవారు వధువు ఇంట భుజింపరాదనియు, భుజించినచో సంబంధము కుదరదనియు, గల విశ్వాసము వివరింపబడినది.

వివాహమనునది దైవనిర్ణయమనియు, ఆ అనుబంధము కుదురుటకు దైవము ఒక సుముహూర్తము నిర్ణయించుననియు అది వచ్చినవేళ ఎన్ని అవాంతరములు వచ్చినను వివాహము జరిగితీరునను విశ్వాసమును "కళ్యాణ మొచ్చినా కక్కొచ్చినా ఆగదు" అను సామెతయందు వివరించిరి.

## సంతానము :

వివాహమునకు పిదప సంతానము గలుగుటకు మిక్కిలి ప్రాముఖ్య మున్నది. మానవుడు తనయుపంతరము తన వారసులను సృష్టించుకొనుట అనునది, మానవజీవితమున జరుగు క్రమపరిణామము.

వివాహమునకు గల ప్రముఖ లక్ష్యమునకు వివరించుచు ప్రాచీన ధర్మవేత్తలు 'సంతానము'ను ప్రధాన లక్ష్యముగా పేర్కొనినారు.

గృహజీవితమున సంతానమునకు గల విశిష్టత ఎంతయో గలదు. 'సంతాన హీనమగు గృహము శూన్యమని' మన సంప్రదాయమున గట్టి విశ్వాసము గలదు అదే విధముగా సంతానహీనురాలగు స్త్రీని ఈ సంఘము కొంత విరక్తితో పరికించుట మనకు తెలిసిన విషయమే. ప్రతి గృహమునకు చిరుదివ్వెలు, చిన్నారి పాపలు. వీరు గృహ జీవితమున చిందించు అందము, ఆనందం అంతులేనిదగుటకూడా సంతానాపేక్షకు మరియొక కారణమగుచున్నది.

ఈ విధముగా గృహజీవితమున ప్రాధాన్యము వహించు 'సంతానము' గురించి వివరించు సామెతలెన్నియో జానపదులలో కలవు. వీరు తమ సామెతలయందు 'సంతానము' సంతానహీనుల గృహ పరిస్థితులు, వారి పెంపకము, వారి మనస్తత్వములు మొదలగువాని గురించి చక్కగా వివరించినారు.

“పిల్లలు లేనిల్లు పీరీలకొట్టం” అను పాత సామెతలో సంతాహీనమైన గృహము వివరింపబడినది. పీరీ అనునది ముసల్మానులు 'మొహర్రము' పండుగరోజు 'హస్తము' వలె తయారుచేసి అలంకరించు చిహ్నము. అది 'హుసేన్' ధ్వజ చిహ్నము. వీనిని గ్రామమందలి ఒక చావడియందు ఉంచుదురు. ఈ స్థలమంతయు విషాదముతోనిండి, కళాకాంతులు లోపించి ఉండును పిల్లలు లేని యిల్లు కూడా ఈ ప్రదేశమువలె ఉండునని అందు, జానపదులు వర్ణించిరి.

అదే విధముగా “బాలలు లేని పట్నం బర్లులేని కొట్టం” అని మరొక సామెత గలదు. ఎచ్చట బాలలు ఉండరో ఆ ప్రదేశము బర్లు (గేదెలు) లేని కొట్టంవలె శూన్యముగా ఉండునని వివరించిరి

సంతానము గురించి వారిలో కొన్ని విశ్వాసములు సైతము అగుపించుచున్నవి. 'పుత్రులు' పున్నామ నరకమునుండి తప్పించుదురను విశ్వాసము ప్రతి హైందవునకు గలదు

“మోదుగులున్న వనము మొగపిల్లలున్న యిల్లు వేతదు” అను అభిప్రాయములను వారు వెలువరించిరి. వనమునకు మోదుగులవలె గృహమునకు మొగపిల్లలు ఎంతో ప్రయోజకులను విషయమునే వివరించిరి.

ఈ సామెతలలో పుత్రి సంతానమునకు గల ప్రాధాన్యతను తెలుపించు చున్నది. పుత్రులు ఆర్థిక జీవితమున తల్లి దండ్రుల పోషణ బాధ్యత స్వీక రించుట, వారికి పుత్రుల వలననే ఉత్తమగతులు చేకూరునను నమ్మకము కలిగియుండుట ప్రధానకారణములు కావుననే వారికి సంఘమున ప్రాధాన్యము కలిగినది. కొడుకైనను ఒక్కడే ఉండరాదను విశ్వాసము జానపదులలో కనిపించుచున్నది. "ఒక్క కన్ను కన్ను కాదు ఒక్కకొడుకు కొడుకుకాదు" అని వివరించిరి

జానపదులలో శారీరక శ్రమ ద్వారా సంపాదించుకొనువారు అధికము. అందువలన శారీరకశ్రమచేయు పుత్రసంతానమునే వారు కోరుకుందురు. దీనిని "వేలెడు పిల్లగాడుంటె వేలుకాసర" అన్న సామెతయందు వ్యక్తపర చినారు. సంసారజీవితమున చిన్న పిల్లవాడైనను ఆర్థికముగా కొంతవరకైనా తోడ్పడునని నమ్మకమును వివరించినారు అటువంటిదె స్త్రీ శిశువు విషయము నను గలదు "కుంచమంత కూతురుంటె తల్లికి మంచంమీదే మరణం" అందు ఆడపిల్ల తల్లికి ఎంతో సహకారి అను అంశము వివరింపబడినది. ఆడ పిల్లల పుట్టుక వలన ఎంతో బరువు బాధ్యతలు తల్లిదండ్రులపై పడును. పెండ్లి మొదలగు సమస్యలగురించిన భయము కూడకలదు. అందువలన ఆడ పిల్లలు కావాలని ఎవరూ కోరుకొనరనియు. అపత్యమాడినచో ఆడపిల్లలు పుట్టుదురను విశ్వాసము ఈ "అబద్ధాలుచెప్తె ఆడపిల్లలు పుడుతరు" అను సామెతయందు వివరించిరి.

పిల్లల పెంపకము గురించియు జానపదులకు కొన్ని అభిప్రాయములు గలవు పిల్లలను అతిగారాబముగా పెంచుటవలన ఎన్నో అనర్థములు వాటిల్ల గలవనివారు కొన్నిసామెతలయందు వివరించివారు. "ఒక్కపిల్లని ఒళ్ళె పెట్టుకుంటె జారిపోయి జారాట్లపడె" అను ఈ సామెతయందు అతిగారాబము వలన కలుగు నష్టమును వివరించిరి.

పిల్లలయందు వారిని గురించి అతిగా మెచ్చుకొనినచో వారి అగడము నకు అంతుండదు. వారు పెద్దలమాట లక్ష్యము చేయకపోగా తమకు కూడ నష్టము చేసికొందురు. ఈ "మావోడు మంచోడంటె మంచం కోడెత్తుక పోయిండు" అను సామెతయందు వివరించిరి. మరో పుత్రుడు "మావోడు మంచోడంటె బండికమ్మ మీదేసుకున్నాడు" మంచివాడని పొగిడిన అగడము చేసి అపాయము చేసుకొనినాడు.

మరికొందరు పిల్లలు అతిగారాబము వలననే పూర్తిగా చెడిపోవుట, మొండి స్వభావము అలవరుచుకొనుట జరుగును. ఈ విషయమును "ఎత్తు కుంటె సంకకురాదు, దించుతే దిగడు" అను సామెతయందు వివరించిరి. ఈ స్వభావము చాల మంది పిల్లలయందు గమనింపవచ్చును, ఈ విధముగా సంతానము పెరిగి పెద్దవారగుదురు.

తరువాత వారు స్వతంత్ర అభిప్రాయములు ఏర్పరచుకొందురు. దానితో పాతతరము వారగు తల్లి దండ్రులకు, ఈ నవయువకులకును, అభిప్రాయ భేదములు ఏర్పడుట ప్రారంభించును. దాని వలనవారు తల్లి దండ్రుల మాటలు వినరు. సరికదా కొన్ని సందర్భములయందు వారిని పూర్తిగా వ్యతిరేకించుట కూడకలదు. దీనిని గమనించిన అనుభవజ్ఞులు

"పుట్టంగ పుత్రులు, పెరుగంగ శత్రువులు" అను సామెతయందు వివరించిరి. అదేవిధముగా మరోసామెత "అడ్డాలనాడు బిడ్డలుగని, గడ్డమొచ్చి సంకనా" అనునది కూడ అటువంటి అభిప్రాయమును వివరించును.

అట్టి పిల్లలే పెరిగి పెద్దలైయౌవనమున పడుగు పెట్టి తమ తమ జీవితము లను చక్కదిద్దుకొందురు.

## స్త్రీలు :

సంఘజీవనము స్త్రీ పురుషులకు కొన్ని ప్రత్యేక ధర్మములను విధులను ఏర్పరచియున్నది. పురుషుడు శారీరకముగ స్త్రీ కన్నను బలవంతుడు అతడు కష్టించి సంపాదించి సంసారజీవితమున భార్య బిడ్డల పోషింపవలసియుండను వృద్ధులగు తల్లిదండ్రుల బాధ్యత స్వీకరింపవలసి యుండును స్త్రీ ప్రకృతి సిద్ధముగా కోమల స్వభావముగలది. అభిమానాప్యాయతలను పెట్టిపుట్టినది అందువలన ఆమెకు సంఘము, గృహజీవనము చక్కదిద్దు బాధ్యతను పిల్లల పెంపకము మొదలగు ధర్మములను విధించినది. ప్రకృతి స్వసిద్ధముగా స్త్రీ పురుషుల భిన్నత్వమును ఏర్పరచినది దానిని అనుసరించియే సంఘము వీరిద్దరికి ప్రత్యేక ధర్మములను విధించినది. సంఘజీవితమున, సంసార జీవితమున స్త్రీకి అత్యధికమగు ప్రాధాన్యత కలదు.

"వేదాకాలమునుండియు స్త్రీలకు అధికమగు ప్రాధాన్యమొసంగబడినది ఆమెను గృహ దేవతగా వర్ణించిరి" 15.

గృహ పరిపాలన, బాధ్యత స్త్రీలే చక్కగా నిర్వర్తించగలరని వారి వేర్పువలనసంసారము చక్కగాసాగిపోవునని మన ధర్మవేత్తలు వివరించినారు

గృహజీవనమున పురుషునికి స్త్రీ తోడ్పాటు లేనిది క్షణము కూడ గడవదు. అనిన అతియోశక్తికాదు గృహజీవనమునకు భార్యాభర్తలు ఇద్దరు రెండు కళ్ళ వంటివారు. వీరిద్దరి కలయికయే కుటుంబ జీవనమునకు, తదుపరి సంఘ జీవనమునకు శక్తిని ప్రసాదించును. అందువలన సంఘమునందును, గృహమునందును స్త్రీకి పురుషునితోపాటు సమానస్థానమున్నది. అనాది కాలమునుండి స్త్రీ, పురుషునితోపాటు సంసార నిర్వహణయందు తనవంతు బాధ్యతను నిర్వహించుచునే యున్నది.

ఆధునిక కాలమున, ఆర్థికజీవితమునందు పురుషునితోపాటు స్త్రీయు పాలుపంచుకొనున్నచుది. గ్రామ జీవనమున పూర్వకాలమునుండియు కొన్ని పేద కుటుంబములందు, శూద్ర కులములయందు పురుషునితోపాటు స్త్రీలు శారీరకశ్రమచేసి సంపాదించి, సంసారపోషణయందు పాలుపంచుకొనుచుండిరి

జానపదులు తమ సామెతలయందు స్త్రీ, గృహమందు నిర్వహించు ప్రాధాన్యము, వారి స్వభావము ప్రత్యేక గుణములను వివరించిరి. వారిలో గలకొన్ని లోపములను సున్నితముగా, వ్యంగ్యముగా విమర్శించినారు.

గృహమునకు శోభ కలిగించువారు స్త్రీలు. వారి మనోభావములకు తగిన విధముగా వారికి రుచి, శుభ్రతలపై గల మక్కువలననుసరించి, వారి గృహమును తీర్చి దిద్దుకొందురు అందువలన ఇల్లాలును గమనించిన వారి ఇంటి సంగతి తెలియునన్న నమ్మకముకలదు దీనిని "ఇంటి సంగతి ఇల్లాలు చెప్తది" అను సామెత వివరించినది

పిల్లలపెంపకము విషయమున స్త్రీకిగల బాధ్యత పవిత్రమైనది. గృహమునందు పురుషునికన్న స్త్రీ పాత్ర అత్యున్నతమైనది. ముఖ్యముగా ఆడ పిల్లల ప్రవర్తన విషయమున తల్లికి చాల ప్రాధాన్యతగలదు తల్లినుండి ఆడపిల్ల ప్రవర్తనను, పనిపాటలను, మంచి మర్యాదలను నేర్చుకొనును. అందువలననే ఆడపిల్ల ప్రవర్తన సరిగా లేకున్నచో, లేదా పని పాటలు రాక పోయినచో "తల్లి"ని విమర్శించుట పరిపాటి. ఈ విషయమునే "తల్లితీరు పిల్ల" అని "తల్లి వందైతే పిల్ల వంది" అను సామెతలయందు వివరించిరి.

స్త్రీ తల్లిగా, గృహిణిగా ఉత్తమ బాధ్యతలు నిర్వర్తించును. కాని కొన్ని విషయములయందు వారికి సహజములగు కొన్ని బలహీనతలుగలవు. వాటిని కూడా జానపదులు తమ సామెతలయందు వివరించినారు.

స్త్రీల స్వభావములను వివరించు జానపదులు "అద్దీ మాట్లాడితే అడ్డుగోడ పెట్టినట్లుంటది" అను సామెతయందు స్త్రీ అబద్దాలు చెప్పినచో అది ఎంతో నేర్పుతో విను వారికి నమ్మకము కలగించునదిగా ఉండునని వివరించిరి. అదే విధముగా స్త్రీల మధ్య సఖ్యత ఎక్కువగా ఉండదను విషయమును "ముప్పైయారు జుట్లు కలియునుకాని మూడు సిగలు కలువవు" అను సామెతద్వారా స్పష్టము చేసినారు. సాధారణముగా ముగ్గురు నలుగురు ఆడవారుకలసి ఉండినచోట తప్పక జగడము జరుగునను విశ్వాసమువలన ఈ సామెత పుట్టినది స్త్రీలకు సంబంధించి కుటుంబసభ్యుల మధ్య బంధుత్వ మును తెలియచేయు సామెతలు ఎన్నియోగలవు.

కొందరు స్త్రీలు అత్తగారుగా తమ క్రొత్త కోడండ్రపైన అధికారము ప్రదర్శించుటయు. కొందరు గయ్యాళి తనముతో వారిని సాధించుటయు కలదు. అటువంటి ఒక అత్తగారి ప్రవర్తనను గూర్చి "కోడలు వట్టిగెందు కుంటది దుడ్డెసెత్తకొమ్మండట" అను సామెత వర్ణించుచున్నది

అత్తపోరుకు గురియగు కొందరు కోడళ్ళు పాపము అటు అత్తగారిని ఇటు భర్తతో చెప్పుకొనలేక వారిలో వారు కుమిలి పోవుచునో లేదా తమ బిడ్డలపైన ఆ కోపమును ప్రదర్శించియో తృప్తిచెందుదురు ఈ విషయమును "అత్తమీది కోపాన బిడ్డను కుంపట్లోశ్తే పే" అను సామెత వివరించుచున్నది. మరికొందరు కోడళ్ళు అమాయకముగా ఉండక అత్తకు తగ్గకోడళ్ళుగా ఉంది వారిని అనుకరింతురు. ఈ విషయమును "అత్త అవుసలవాడ కోడలు కోమటి వాడ" అను సామెతయందు స్పష్టపరచినారు మరియొక కోడలు అత్తగారికే తెలివిగా పనిచెప్తుందని ఈ "భీతికల్ల కోడలు బిందెలెరిగి అత్తనీళ్ళు మొట్కాల ఎత్తిపోయమన్నదట" అను సామెతన వివరించినారు. కొందరు స్త్రీలయొక్క ప్రవర్తన వింతగాఉండును. అటువంటి ఒకగయ్యాళి భార్య గురించి "మొగన్ని కొట్టింది మొరపెట్టింది" అను సామెతయందు వివరించినారు

మరో ఇల్లాలుకుభర్తపై అనురాగముకన్న అతని సంపదపైననే ప్రేమ అధికము. అటువంటి ఇల్లాలు గురించి వ్యంగ్యముగా అర్థాంతరముతో

"పోరెమోలే మొగుడుపోంగా బొంతచింపులకేడ్చిందట" అనుసామెతయందు వివరించారు. ఇందు ఆ ఇల్లాలు పెద్దగోనెవంటివంటి భర్త చనిపోయినాడని చింతించవలసినదిపోయి అతనితోపాటు కాలిపోవుటకు సిద్ధముగా ఉన్న పాత బొంతలను గురించి ఏడ్చినదని వ్యంగ్యముగా చెప్పిరి.

ఆడంబరజీవితము పై మోహముచే తనకుతగిన పతితో కాపురముచేయిక చింతించు ఇంతి గురించి జానపదులు "రాజును చూచిన కండ్లతో మొగున్ని చూచి మొత్తుకొంది" అను సామెత యందు వివరించినారు

కొందరుస్త్రీలకు అత్తపోరుతోపాటు ఆడబిడ్డలపోరు తప్పదు ఆ:దుచేతనే ఆడపిల్లలకు సంబంధము చూచునపుడు ఆ యింటి అత్త, ఆడుబిడ్డల ప్రవర్తన గురించి తెలుసుకొనుట పరిపాటి, గృహజీవితమున ఆడుబిడ్డల పాత్రగురించి "ఆడిబిడ్డ అర్ధమొగుడు" అను సామెతన పివరించినారు. మొగుడి తరువాత అంతటి అధికారమును ప్రదర్శించునది ఆడుబిడ్డ ఈవిడ అటు భర్తకు ఇటు అత్తగారికి మధ్యఉండి కొత్తకోడలిని అనుక్షణము సాధించుటయుగలదు కొన్ని సందర్భములయందు తల్లితో, అన్నదమ్ములతో కోడలిపైన లేనిపోని చాడీలు చెప్పి కాపురములు చెడగొట్టుట కలదు. కనుకనే ఈవిడగారి పాత్ర గృహమున అధికారికమైనది

"అత్తింటి కాపురం, మోచేతిదెబ్బ" ఈ సామెతయందు అత్తగారిపోరు ఎంతకష్టమో వివరించపడినది.

మరికొందరు స్త్రీలకు అత్త ఆడుబిడ్డల పోరుతోపాటు సవతిపోరుకూడ ఉండును. సాధారణముగా సవతులమధ్య కయ్యములు అసూయద్వేషములు అగుపించుచుండును. అందువలననే "సవతిపోరు స్వర్గానికి పోయిన తప్పదు" అను సామెత పుట్టినది. స్వర్గము సర్వసుఖములుపొందు ప్రశాంత ప్రదేశమని నమ్మకము అటువంటిచోటకూడ సవతియొక్క పోరు వెంటాడుతునే ఉంటుందని అతిశయోక్తితో వివరించినారు.

ఇక తోటి యారాళ్ళ మధ్యకూడ స్పర్ధలు తప్పవు అని 'అత్త గొట్టినందుగ్గాదు, తోటికోడలు నవ్వినందుకు"అను సామెతయందుచెప్పిరి వారిలో వారు ఒకరిని మించి ఒకరు ఉన్నతముగా జీవించవలెనని, ఆడంబరము ప్రదర్శించవలెనని ప్రయత్నించుచుండుట అగుపించును దీనినే"తోటియారాలు తొడగోసుకుంటె, తాను మెడగోసుకుంటి"అను సామెతయందు వ్యంగ్యముగా వివరించిరి

ఈ విధముగా ఉమ్మడి కుటుంబమందు స్త్రీల తత్వములు చక్కగా వివరించిరి. ఈనాడు ఎవరికి వారుగా ఉమ్మడి కుటుంబము నుండి చీలిపోవుటచే ఈ సమస్యలు కొంత తీరి పోయినను గ్రామ జీవితమున నేటికిని వానిని గమనింపవచ్చును. కొందరి స్వభావములు మాత్రము ఎచ్చట ఉన్నను, ఎంత ఎదిగినను మారవు.

పురుషులు :

సంఘము పురుషులకు కూడ కొన్ని ప్రత్యేకమగు విధులనేర్పరచినది. గృహజీవనమున వారు పోషణ భారము వహించుట, సంతానమును భార్యను, తల్లిదండ్రులను, సంరక్షించుట, వారి అవసరములు తీర్చుట మొదలగు బాధ్యతలు ఎన్నియోగలవు. సహజముగ శారీరక పరిస్థితులు, మానసిక స్థితి గతుల ననుసరించియే ఈ విధులు గలవు అవన్నియుగాక కొన్ని ప్రత్యేక ప్రవృత్తులు గల పురుషుల గురించి జానపదులు తమ సామెతల యందు వివరించినారు.

గృహ జీవితమున మగపిల్లల ప్రవర్తనకు ఎక్కువ బాధ్యత తండ్రిది. మగ పిల్లలు సహజముగ తండ్రిని అనుకరింతురు అందుచేతనే వారిని శిక్షణలో పెట్టుట యందు తండ్రి శ్రద్ధ వహించుట అవసరము. అట్లుగానిచో తండ్రి ఒక పొరపాటు చేసిన కుమారుడు మరెన్నియో పొరపాట్లు చేయును. ఈ విషయమునే 'తండ్రి తంతెల మీద ఎగిరితే, కొడుకు కొనేట్ల ఎగిరిండు' అను సామెత యందు వ్యంగ్యముగ వివరించినారు. అనగా మగపిల్లలు అకార్యకారణము సంద్రైన తండ్రిని అనుకరింతురను సత్యము వివరింపబడినది.

అదే విధముగా సంపాదన విషయమున కూడ మగవారికి శ్రమ తప్పదు కష్టపడి సంపాదించుట తప్పని సరి అట్లు కష్టపడి సంపాదించి తన వారిని పోషించుట ధర్మము ఈ ధర్మము సక్రమముగా పాటించుట వలన చక్కని ఫలితము చేకూరునని ఈ 'ఆడ్ది కష్టం చేస్తే అడుగంటును, మొగోడు చేస్తే మొగులంటును' అను సామెత యందు వివరించినారు. అంతేకాక ఆడ దాని కష్టపెట్ట కూడదని, మొగవాడు కష్టపడి సాధించినదే తృప్తి అనియు చెప్పినారు.

కొందరు పురుషుల ప్రవర్తన వింతగా ఉండును. ఈ ప్రవర్తన జాగ్రత్తగా పరిశీలించి జానపదులు తమ సామెతల యందు వివరించిరి. ఒక భర్త తన ధర్మము తాను సక్రమముగా పాటింపక, తప్పతాగి భార్య బిడ్డలను పోషింపక నిర్లక్ష్యముగా ప్రవర్తించుటయేగాక భార్యను దీవించుటకు మారుగా ఈ 'ఎరువు సొమ్ములు పెట్టుకొని మొగని కాళ్ళకు మొక్కితే కల్గితే చేయి స్తగని కల్లుకురెండు పైసలిమ్మనె' అని సామెతను అతనికి తాగుడు ప్రధానము. అందువలననే తన భార్య ధరించినవి ఎరువుసొమ్ములా అని గమనింపక ఆవిడ దగ్గర డబ్బు ఉందని కల్లుకు రెండు పైసలిమ్మని అడిగి నాడని వ్యంగ్యముగా విమర్శించినారు.

మరొకడు సంపాదన చేతకాకయున్నను భార్యను శాసించుటయందు ఘటికుడు. "అసలు లేదు మొగుడా అంటే పెసరు పప్పు వండవే పెండ్లామా అన్నాడట"

మరొక పురుషుడు 'నిచ్చె బూరెలు చేస్తే నిన్నెందుకు కొడ్తనే పెండ్లామా" అన్నాడని వివరించినారు.

కొందరు పురుషులు ఎన్నో బీరాలు పలికి. చివరకు ఏదీ చేయలేరు. వారిది మాటల ప్రతాపమేగాని చేతల ప్రజ్ఞ కాదు. వీరు ఆచరణకు వచ్చు వేళ చిన్న పని కూడా చేయలేరు.కాని ఎంతో పెద్ద పనులు చేయునట్లుగ నటింతురు. వీరితత్వాన్ని ఈ' కూట్లే రాతు తియ్యనోడు ఎట్లే రౌతుతీస్తాడు' అను సామెత యందు స్పష్టపరచినారు.

అదే విధముగా ఇటువంటిదే మరో సామెత

"నేతిల ఈగను తియ్యనోడు నూతిల వడ్డదాన్ని తీస్తాడు" అనునది. ఇందు మగవారికి సహజముగా కష్టపడి పనిచేయుట యందు,ఇతరులకు సహాయము చేయుట యందు నేర్పుఉండవలయునని,ఐద్ధికము కూడదని వివరింపబడినది.

స్త్రీ పురుషుల మధ్య సఖ్యత అవసరము ఇదికుటుంబజీవనమున తప్పని సరి. స్త్రీ పురుషుల ధర్మ బద్ధ మగు జీవితము కుటుంబ జీవితము.

అందు వలన సంసార జీవితమున కలతలు రాకుండ చూచుకొని ఇంటిని స్వర్గముగా మార్చుకొనుట యందు దంపతులకు ఎంతయో బాధ్యత కలదు. కాని కొందరు స్త్రీ పురుషులు సఖ్యత లేక చికాకుతో జీవితము గడుపుదురు. వారిని గురించి 'వల్లని భార్య చెయ్యితలిగినా తప్పే కాలుతలిగినా తప్పే' అను సామెతన వివరించిరి. ఇష్టము లేని భార్య ఏ పనిచేసినను భర్తకు తప్పుగానే కనిపించునను యదార్థమును స్పష్టము చేసినారు.

అందు వలన దంపతులు ఇరువురును తమతమ పొరపాట్లను గమనించి సామరస్యముతో గృహజీవితము గడపవలయునని పరస్పరము అయిష్టము వలన కాపురము కూలిపోవుననియు పరోక్షముగా వివరించినారు.

కుల వ్యవస్థ :

ఆదిమకాలమందు గణములుగ, తెగలుగ జనము జీవించుచుండిరి ఈ గణములందలి ప్రజలందరు ఒకే రక్తసంబంధము గలవారు. ఈ గణ వ్యవస్థయే తరువాత వర్ణవ్యవస్థగా రూపొందినది ఋగ్వేదకాలము నుండి చాతుర్వర్ణ్య వ్యవస్థ, కనిపించుచున్నది. 'చాతుర్వర్ణ్య వ్యవస్థ గురించి భగవానుడు గీత యందు' 'గుణములను, కర్మములను బట్టి నాలుగు వర్ణములను నేనే సృష్టించితిని'16 అని చెప్పినాడు. అనగా గుణములతో పాటు, వారి కర్మలను (పనులను) బట్టి కూడా వర్ణవిభాగము జరిగినదని వివరింపబడినది.

'బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, అను నాలుగు వర్ణముల వారు విరాట్ స్వరూపుని ముఖము, బాహువులు, తొడలు, పాదములు'17గా వర్ణింపబడినారని మరియొక అభిప్రాయము.

తరువాత కాలమున, వర్ణ వ్యవస్థయే వృత్తి ప్రధానముగా విభజనలు గల కుల వ్యవస్థగా మారిపోయినది ఆయా వృత్తులే క్రమముగా కులములుగా మారిపోయినవి 'Hindu caste system is basically a fixed order of occupations' 18 అని తెలియు చున్నది.

మొత్తము మీద గణ వ్యవస్థ, వర్ణవ్యవస్థ క్రమముగా కులవ్యవస్థగా మార్పు చెందినవని చెప్ప వచ్చును.

మానవ సంఘమున కులమునకు చాల ప్రాధాన్యము కలదు. 'కులము సంఘములో ఒక ప్రత్యేక వర్గంగా వ్యవహరిస్తుంది. పుట్టుట, గిట్టుటలు, సంప్రదాయములు, వివాహములు, భోజనాది విషయములలో సైతం అతి కఠినంగా నియమాలు అమలు జరుపుతుంది'19

ఒక కులమునకు చెందినవారు, మరొకకులము వారితో వివాహాది సంబంధములను అంగీకరింపరు. కొందరు తమ కులమునకు చెందని వారింటి భోజనాదులు స్వీకరింపరు. గ్రామీణ జీవితమున ఈ నాటికి 'కులము' విషయమున చాల పట్టుదల ప్రదర్శించుట గలదు. ఒక్కొక్క కులమునకు ప్రత్యేక స్వభావము ఉండునని జానపదుల విశ్వాసము.

## బ్రాహ్మణులు :

బ్రాహ్మణులు దైవసమానులని, భూలోక దైవములని విశ్వాసము, 'వీరు దేవుని ముఖము నుండి జనింతురను నమ్మకము కలదు'20 కావున వీరికి సంఘమునందు అగ్రస్థాన మీయబడినది. గ్రామీణ జీవితము నందు ఈ నాటికి వీరిని పెద్ద కులము వారని గౌరవించుట కలదు. వీరిలో పౌరోహిత్యము, వృత్తిగా గలవారిని పురోహితులు అనియు 'లౌకము' వృత్తి యందు, మరియు, గుళ్ళో అర్చక వృత్తి యందు స్థిరపడినవారు గ్రామ కరణములు, గుడి పూజారులు, వారు 'కరణములు అయ్యవార్లు' అను కుల నామములతో వ్యవహరింప బడుచున్నారు. వీరిలో వీరికి భోజనాదులు స్వీకరించు విషయమున పట్టింపులు లేకున్నను, వివాహ సంబంధములు వీరి మధ్య లేవు.

బ్రాహ్మణులు భోజన ప్రియులు, వీరు సహజముగా, సంతుష్టిగా భోజనము చేయుటవలన, భోజన విషయమున మిక్కిలి శ్రద్ధ కనబరుచట వలన, ఈ విధముగా వీరు గుర్తింపబడిరి. ఈ విషయమున 'ఓపిక లేని

బ్రాహ్మడు ఊడుకు పప్పులో చేయి పెట్టిండు' అను సామెత యందు పరోక్షముగా వివరించిరి.

ఈ 'పప్పన్నానికి పదామడ బోవాలె' అను సామెత యందు కూడ బ్రాహ్మణుల భోజన ప్రియత్వమును వివరించిరి.

'బామన్ల వ్యవసాయం సుద్దరి సమారాధన' ఈ సామెత యందు ఎవరి కులధర్మమును వారు పాటించిన శోభించునను విషయమును వివరించిరి. బ్రాహ్మణులకు వ్యవసాయము, శూద్రులకు సమారాధన చేయరాదని వర్ణించిరి.

'కర్రె బాపనోన్ని ఎఱ్ఱమాలోన్ని నమ్మరాదు' ఈ సామెత యందు వారి వారి కులములకు ప్రత్యేక వర్ణము లుండునని దానికి భిన్నమగు వర్ణము గల వ్యక్తి ఆ కులమున ఉన్నచో అతడు నమ్మదగినవాడు కాదని వివరించినారు సాధారణముగా బ్రాహ్మణుల యందు నలుపు గలవారు, మాల వారి యందు ఎరుపుగలవారు అరుదను విశ్వాసముతో ఈ సామెత పుట్టినది.

'అయ్యవార్ల పెండ్లి అయ్యేదాక తెల్వదు' ఈ సామెతన వైష్ణవుల గృహమున జరుగువివాహ నిర్ణయము తెలియదని వివరించుటకుగలకారణము, వివాహమునకు ముహూర్తము నిర్ణయించుట, మిగతా కార్యక్రిములు నిర్వర్తించుట వారి చేతిలోపని అగుటవలననే అని తెలియును. ఈ విషయము బ్రాహ్మణులకు కూడ వర్తించును.

సాధారణముగా గ్రామ వ్యవహారమున, ప్రిము ఖపాత్ర గ్రామాధికారి యగు కరణముది అతను ఊరికి శాసనాధికారి, ప్రభుత్వ ప్రతినిధి కొన్ని వ్యవహారముల యందు కఠినముగా వ్యవహరించుట తప్పనిసరి అంతేకాదు. న్యాయన్యాయ విచారణ చేయునపుడు కొందరికి లాభము, మరి కొందరికి నష్టము వాటిల్లును. దీనివలననే, గ్రామ జీవితమున గల రాజకీయ స్పర్థల వలన ఈర్ష్యా ద్వేషములు ఏర్పడుట సహజము. అటు వంటి ద్వేషము కరణము జీవితాంతము మరువడని ఈ 'కర్నాల పగ కాట్లె పడ్డ బోదు' అను సామెతన వివరించిరి.

వివాహ సంబంధ విషయమున కరణములు వరుసలను ఎక్కువగా పాటించరని నమ్మకము కలదు. ఈ 'కర్ణాలకు వరుసల్లేవు కప్పలకు తోకల్లేవు' అను సామెత యందు ఈ విషయమును వివరించిరి. సాధారణముగా వీరు దూరపు సంబంధము లందలి వరుసలను పాటింపక పోవుట కలదు.

## క్షత్రియులు :

వీరు ప్రధానముగా రాజ్యపాలకులగు జాతిగా పరిగణింపబడిరి. నేటి కాలమున రాజులు రాజరిక వ్యవస్థ లేక పోయినను క్షత్రియులను ప్రత్యేక కులము వారు కలరు. వీరి పూర్వీకులు రాజరికము నెరపిన వారని తెలియును

జానపదులు తమ సామెతలందు ప్రత్యేకముగా 'క్షత్రియ' కులము గురించి వివరించక పోయినను రాజరికము నెరపిన రాజుల గురించి వివరించిరి. రాజులు ఎక్కువగా కళాప్రియులు, విలాస పురుషులు, అందువలన ఎన్నియో సుందర నిర్మాణములను, శిల్ప సౌందర్యము గల కట్టడములు నిర్మించిరి. వారి 'సంపాదన యందు ఎక్కువ భాగము కళామయ నిర్మాణ లకు వెచ్చింతురను విషయమును ఈ 'రాజుల సంపాదన రాళ్ళ పాలు' అను సామెత యందు వివరించినారు.

అదే విధముగ రాజుల ఆడంబర జీవిత విధానమును, వారి విలాస జీవితమును ఈ 'రాజుల సంపాదన గాజుల పాలు' అను సామెతన విమర్శించిరి

రాజులు సంపన్నులు అందు వలన వారి జీవనము ఉన్నతముగా దర్పముతో, ఆడంబరముగా ఉండుట సహజము. వారి స్థితిని గురించి, తన పరిస్థితికి చింతిల్లు అమాయకురాలి ఆలోచనను వ్యంగ్యముగా ఈ 'రాజును చూచిన కండ్లతో మొగున్ని చూచి మొత్తుకుంది' అను సామెత యందు వివరించిరి.

రాజులు దర్శించు ప్రాంతములను ఉత్తమముగా తీర్చిదిద్ది వారి మెప్పును పొందుటకు క్రింది అధికారులు ప్రయత్నించుచుందురు ఈ విషయ మునే 'రాజు రాకదలేదు తొవ్వ నూకుడు లేదు' అను సామెతన వ్యంగ్యముగా విమర్శించిరి. రాజులు చూడని ప్రదేశము యొక్క దుస్థితిని పరోక్షముగా వివరించిరి ఈ సామెత వర్తమానకాలమునకు సరిపోవు చక్కని సామెత.

వైశ్యులు :

వీరు వర్తకము ప్రధానవృత్తిగా జీవించుచున్నారు. వీరి వృత్తి ధర్మము గురించి, స్వభావము గురించి జానపదులు తమ సామెతలందు వివరించిరి

వైశ్యులను 'కోమటి' వారు అని వ్యవహరించుట గలదు. వీరు వస్తువులను జాగ్రత్తగా, శ్రద్ధతో తూచి లాభసాటి అగునట్లు అమ్ముదురను వీరి వృత్తి ధర్మమును ఈ 'కోమటి కులం పైపను తులం' అను సామెతన వివరించిరి వీరిని దయాదాక్షిణ్యములు లేనివారని, స్వార్థ పరులని చులకనగా చూచుట గలదు. అందువలననే ఈ 'కోటిచ్చి కోమట్ని కొనాలి నూరిచ్చి నూతిల దొబ్బాలి' అని సామెత పుట్టినది.

ఈ కులము వారు బిగ్గరగా మాట్లాడు అలవాటు కలవారని ప్రచారము కలదు. అందువలన వీరు రహస్యముగా మాటలాడుకొనిన అది ఊరంతా వినిపించునని హాస్యముగా, వ్యంగ్యముగా, ఈ 'కోమట్ల గుసగుస ఊరంత రసరస' అను సామెత యందు వివరించిరి.

శూద్రులు :

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యజాతులుకాక మిగతాకులముల వారందరు శూద్రజాతిగా పరిగణింపబడినారు. వీరిని గురించి జానపదులు తమ సామెతల వివరించిరి.

శూద్రజాతి యందు రెడ్లు, వెలమలు, అగ్రస్థానమున గలరు. రెడ్లు కష్టించి పనిచేయు రైతులు. వీరు వ్యవసాయము నేర్పుతో చేసి అధిక ఫలసాయము పొంది ఆర్థికమగు ఔన్నత్యము సాధించుట వలన వీరిలో పేద వారు తక్కువ అని తెలియును. ఈ విషయమును ఈ 'రెడ్డిని పేదనరాదు గొడ్డును సాదనరాదు' అను సామెతన వివరించిరి.

'రెడ్ల కులాలు వడ్ల కులాలు లెక్కలేవు' ఈ సామెత రెడ్డి కులము లందు గల పలు తెగల గురించి వివరించునది. 'వడ్ల'లో చాలా రకములు ఉండును. ఉదా. కిచిడి. హంస, జయ, సాంబాలు మొ॥ అదే విధముగా, రెడ్ల యందు పాకనాటి, పెడగంటి, దేసూరి, మోటాటి మొదలగు తెగల వారు గలరు.

గ్రామ జీవితమున రెడ్లతో సమానముగా ఆర్థిక రాజకీయ జీవితమున పోటీపడువారు 'వెలమలు' వారినే దొరలు అందురు. తెలంగాణమున వీరిలో కొందరు 'పోలీసు పటేల్, మాలీపటేలు, అను గ్రామాధి కారులుగ ఉన్నారు. 'వెలమలు' పౌరుషమునకు ప్రతీకలుగా పేరు గాంచిరి. వీరిని గురించిన సామెతలెన్నియో జానపద జీవితమున వెలసినవి.

'ఎలుమోని పగ ఏట్ల వడ్డపోదు' అనునది, ప్రచురముగా వినిపించు సామెత. గ్రామరాజకీయముల, సముచిత పాత్ర వహించు వీరు పౌరుష వంతులును, అభిమానవంతులు, అగుటవలన రాజకీయ మగు కక్షలు, ద్వేషములు వాటిల్లిన సందర్భమున 'పగ' పట్టినచో, విడువరని వారి 'పగ' జీవితాంతము ఉండునని, ఏరువపడ్డాపోని పగవారిది అని అతిశయోక్తితో వివరించినారు.

వెలమలు వారిలో వారికి తగాదాలు వచ్చినచో, సరియగు ప్రత్యర్థు లగుటచే, ఎప్పుడూ ద్వేషాగ్ని రగులు చుండుట వలన, నిరంతరము పోట్లాట జరిగి గ్రామము ఎనుబోతులున్న దొడ్డివలె అశాంతిగా ఉండునని'ఎలుమోల్లున్న ఊరు, ఎనుబోతులున్న దొడ్డి.' అతిశయోక్తితో వర్ణించినారు. ఎనుబోతులు, అడవిలో జీవించునవి. వీనిని 'దొడ్డి' యందు బంధించినచో, అవి ఒకటితో మరొకటి ఎప్పుడూ పోట్లాడుకొని, 'దొడ్డిని' అశాంతి పాలు గావించును.

కాపువారి గురించి 'కందిత్తుకు పమరులేదు కాపోనికి నెనరు లేదు' ఈ సామెత యందు, కాపువారికి నెనరు (న్యాయము) లేదను విషయమును కందిత్తుకు చమరు లేని లక్షణము వలె ఉన్నదని వర్ణించినారు.

కమ్మరులు :

వీరి వృత్తి ఇనుప పని ముట్లు, పాత్రల వంటివి చేయుట; వారు నివసించే ప్రాంతము, ఇనుప పని ముట్లకు కేంద్రమని ఈ 'కమ్మర వీధిలో సూదులమ్మినట్లు' సామెత వివరించును.

వడ్రంగులు :

వీరు 'కొయ్య'తో పని ముట్లు చేయుదురు. వారి పనితనము గురించి వారి స్థితి గురించి ఈ 'కుందనం కాదు చెక్కనం కాదు కూటి కాడికొత్తె ఎందుకు కొరగాడు' సామెత వివరించును. వడ్లోనికి తెడ్డ కరువు' సామెత వారి జీవన స్థితిని వివరించు సామెత.

కుమ్మరులు :

వీరు మట్టి పాత్రలు చేసి జీవిస్తారు. 'కుమ్మరికి కుండ కరువు' సామెత వృత్తి ధర్మాన్ని, దీన స్థితిని వర్ణించుచున్నది.

కంసాళ్ళు :

వీరు బంగారు, వెండి ఆభరణములు చేయుదురు; వారు అతి విలువైన లోహపు పనులు చేయువారు కాబట్టి వారి ముందు జాగ్రత్తగా వ్యవహరించాలని 'కంసాలి ముందు కథలు చెప్పినట్టు' సామెత వివరించుచున్నది. వారు ఆభరణములు చేయునపుడు కొంత బంగారము, ఏవిధముగానైన మిగుల్చుకుంటారని అది ఇతరులు కనిపెట్టలేరని ఈ 'కంసాలి మాయ కంసాలికే తెలుస్తది' సామెత వర్ణించును.

పద్మశాలీలు :

వీరిలో పద్మశాలీలు, పట్టు శాలీలు అను రెండు తెగలు గలవు. వీరు వస్త్రములు 'నేసి' జీవింతురు. ఈ వృత్తి ధర్మాన్ని 'శాలోడు పక్కగ నేస్తే మేరోడు వంకర చేసే' 'నేసేరా శాలోడు నెల కొక్కబోగు' సామెతలు వివరిస్తాయి. వాళ్ళలో కొందరు అసత్యవాదులని 'శాల బొంకుడు కోమటి జరుపుడు' సామెత వర్ణించున్నది.

గౌండ్ల వాళ్ళు :

వీరిని 'గామాల' వాళ్ళు అని కూడ అందురు. వాళ్ళ కులము - శైవ, గలవి విమర్శను ఈ 'గౌండ్ల కులం ముండ్లకులం' సామెత వివరించును.

దాసరిలు :

వీరు దేవుని 'దాసులు' అని చెప్పకుంటారు. వీరి వృత్తి, దేవునిపై చదువుతూ, ఇల్లిల్లు తిరిగి యాచక వృత్తి యందు జీవిస్తారు. వీరి వృత్తి ధర్మాన్ని ఈ 'పాడిందే పాటరా పాచి పండ్ల దాసరి' సామెత వీరి జీవన స్థితిని 'దాసరి తిప్పలు దైవాని కెరుక' సామెత వర్ణించుచున్నది.

జంగములు :

శైవ మతము సృష్టించిన 'కులము' జంగము కులం వీళ్ళకు గల ప్రధాన సంపద 'విభూతి' అని ఈ 'జంగం జంగం రాసుకుంటే రాలేది బూడిద' సామెత వివరించును.

తమ్మళ్ళు :

వీరు మంగళ వాయిద్యాల్ని మ్రోగించి పొట్ట పోసుకుంటుంటారు.

శైవమతము వృష్టించిన కులము వారు వీళ్ళకు వాయిద్యము మోగించడము తప్ప వరిపాలన సాధ్యముకాదని ఈ 'అర పెత్తనం తమ్మిళ్ళ దొర తనం' సామెత వర్ణించుచున్నది

గొల్లలు :

వీరు 'గొర్లు' మేకలు, కాసి, జీవిస్తుంటారు. వీరు అమాయకులని 'గొల్లాని కెమెరుక మల్లె పూవువాసన' 'గొల్లానికి మల్లెపూవిస్తే తాటాకనుకొని తడికె మీద ఏసిండు' సామెతలు వర్ణిస్తాయి.

కురవలు .

వీరి వృత్తి గొంగళ్ళు (కంబళ్ళు) నేయుట, వీరు గొంగళ్ళు మన్నికగా ఉండుటకు నేత బొగులపై గుద్దుచు సిద్ధము చేస్తారు దానిని ఈ 'కురుమ కద్దులాట, పింజారి పీకులాట' సామెత వర్ణించును.

బెస్తలు ·

వీరిలో కొందరు చేపలు పట్టి, మరి కొందరు పని పాటలు చేసి జీవిస్తుంటారు. పంపన్నుల ఇంట పెండ్లిళ్ళ వధూవరుల, పల్లకిని ఎత్తుతారు ఈ వందర్భమున బెస్తలలో కుల పెద్ద పల్లకిలో కూచున్న వధూవరుల చెప్పులు మోయడము ఆచారము, దీనిని ఈ 'బెస్త పెద్దిరికం చెప్పులమోత' సామెత వివరించును.

మంగళ్ళు :

వీరు 'క్షౌరకర్మ' చేసి జీవిస్తుంటారు, వీరి వృత్తి ధర్మమును ఈ 'మంగలోని పెంట తప్పితే బొచ్చు ఐయుట పడ్డట్లు' సామెతలో వ్యంగ్యముగా వివరించుట గమనించవచ్చు.

చాకళ్ళు :

వీరు బట్టలు శుభ్రపరచి జీవింతురు, వీరికి 'చదువు' లేకున్నను 'తెలివి'కి లోటులేదు, అను విషయమును, ఈ 'చదువుకున్నోని కన్న చాకలోడు నయం' సామెత వివరించుచున్నది. చాకళ్ళు, మంగళ్ళు, వృత్తి ధర్మాలను తప్ప, 'వ్యవసాయము పనులందు ప్రజ్ఞ చూపుతారని ఈ 'చాకలి మంగలి పొత్తు ఇంటి కిత్తురాదు' సామెతన వర్ణన.

హరిజనులు :

హరిజనులు సంఘము నందు అస్పృశ్యులుగ చూడబడుచున్నారు. వీరిని గురించి కూడ కొన్ని సామెతలు జానపద జీవితములో కలవు. 'మాల మాటలు, నీళ్ళమూటలు' అను సామెత యందు గ్రామీణ జీవితమునందు వీరిపై గల అభిప్రాయము వెలువరించుచున్నది. ఇందు వారి మాటలు, నమ్మదగినవికావని వివరింపబడినది, నీళ్ళపైన మూటలవలె వారి మాటలు ఉండునని, ఉపమానముతో చెప్పినారు.

ముసల్మానులు :

ముసల్మానుల గురించి, వీరు ప్రత్యేక మతానికి జాతికి చెందిన వారయినను, జానపదుల దృష్టి యందు మాత్రము, ప్రత్యేక కులమనియే భావము. వారి గురించి జానపదులు తమ సామెతల యందు వివరించినారు ఈ 'మొలదారం లేంది మొండి కులం' అనునది, వీరి మత సంప్రదాయమునకు, వారి స్వభావమునకు ముడిపెట్టి వివరింపబడిన సామెత. ముస్లింల మత సిద్ధాంత ప్రకారముగా. హైందవ సంస్కృతి యందు వలె 'మొలత్రాడు' ఉండదు.

ఈ విధముగా జానపదులు తమ సామెతలయందు . వివిధ కులములను గురించి వివరించినారు.

## వృత్తులు :

వృత్తులపై ఆధారపడి 'కులములు' ఏర్పడినప్పటికిని, కొన్ని 'వృత్తులు' కులములతో సంబంధము లేకుండ నిర్వహించ బడుతున్నాయి. అటువంటి వృత్తులలో కొన్నింటిని జానపదులు సామెతలలో వివరించినారు. అవి 1. వ్యవసాయము 2. వ్యాపారము 3. పడుపువృత్తి 4. చోరవృత్తి 5. యాచకవృత్తి 6. మంత్రసానివృత్తి.

## వ్యవసాయము :

వ్యవసాయము 'శ్రమ' యే ప్రధానముగా కల వృత్తి వ్యవసాయము వృత్తిగా చేసుకొని అన్ని కులముల వారు జీవించు చున్నారు.వ్యవసాయము నందలి సాదక బాధకాలు కొన్ని సామెతలలో గమనింపవచ్చును. శ్రమించే వృత్తి అందుచేత కష్టపడే కులాల వారికే వ్యవసాయం సాధ్యమని 'బామ్మల వ్యవసాయం,ముద్దరిపమారాధన'అన్నారు.పొలాన్ని అంటిపెట్టుక ఉండవలెనని 'తిరిగితె వరి పొలం తిరుగ పోతే అడవి పొలం' అన్నారు. కష్టపడి 'కృషి' చేయవలెనని కష్టానికి తట్టుకోవలెనని 'ఏడువ పేరేస్తే వ్యవసాయం' సామెత వివరించు చున్నది. వ్యవసాయము శ్రద్ధశ్రద్ధముగా చేయ వలయునని ఈ 'ఏడుస్తూ వ్యవసాయము మొదలు పెడ్తె కాడి మోకు దొంగలెత్తుక పోయారట' సామెతప వర్ణన.

## వ్యాపారము :

ఈ వృత్తిలో గల మంచి చెడ్డలు కొన్ని సామెతలందు జానపదులు వర్ణించినారు, వర్తకుల లాభాలోచన గురించి'లాభం లేని సెట్టి వరదమున పోడు' సామెత వివరించుచున్నది 'గంప లాభం చిల్లి తీసింది.' అనుసామెత ఒక్కో మాటు వచ్చిన లాభము మరో విధముగా నష్టమునకు దారి తీయునని వర్ణించు చున్నది.

## పడుపువృత్తి

శరీరమును అమ్ముకొని జీవించడము 'పడుపువృత్తి' దాని గురించి, ఈ వృత్తిలోని 'స్త్రీ'లకు పరువు మర్యాదలు లభించవని. 'పడ్పుకున్న ఇల్లు కుడ్పుక పోతుంది' సామెత వివరించుచున్నది ఈ వృత్తిలో 'వయసు'కు ప్రాధాన్యత ఉంటుదని 'లంజ ముదిరినా ముంజముదిరినా పనికి రావు' సామెత వర్ణించుచున్నది వాళ్ళు తను వద్దకు వచ్చే వాళ్ళ 'డబ్బు'ను బట్టి విలువ ఇవ్వగలరని వాళ్ళకు సమర్పించిన సంపద వలన ప్రయోజనము శూన్యమని 'లంజకు పెట్టిన సొమ్ము గోడకు కొట్టిన సున్నం' అను సామెత ఈ వృత్తి చేయు వారి బ్రతుకుల గురించి 'లోన పురుగులు పైన మెరుగులు' సామెత వివరించుచున్నవి

## చోరవృత్తి

దొంగతనము వృత్తిగా చేసుకొని జీవించేవారు ఉన్నారు అటువంటి వారిగురించి కొన్నిసామెతలందు గమనించవచ్చు ఈ వృత్తికిప్రధానకారణము సోమరితనమని ఈ 'వంగలేనోడు దొంగల్లో కల్సిండు' సామెత వివరించు చున్నది దొంగతనము చేసిన వాళ్ళ జీవితము పట్టుపడనంత వరకు బాగుగా వుంటుందని ఈ 'దొరికితేనే దొంగ లేకుంటే దొర' సామెత చెప్పుతున్నది దొంగతనము ఎక్కువగా రాత్రిళ్ళు నిర్వహించే వృత్తి కాబట్టి వాళ్ళకు ఎదురగు కష్టములను వ్యంగముగ ఈ 'దొంగకు తేలుకుట్టినట్లు' సామెత వర్ణిస్తుంది ఈ వృత్తిలోని వాళ్ళు కడు నేర్పుతో ఈ వృత్తి నిర్వహించుదురని 'దొంగను దొంగే పట్టాలి' సామెత వివరించుచున్నది

## యాచకవృత్తి

సమాజమునందు అంగవికలురు, అనాథవృద్ధులు, ఆర్థిక పరిస్థితి చిన్నాభిన్నమైన వాళ్ళు, భిక్షకవృత్తి పై ఆధారపడి జీవించుట గమనించవచ్చు వారికి సమస్తసంపద వారు యాచనకు ఉపయోగించు 'చిప్ప'అని ఈ 'బిచ్చపోన్ని కొట్టె చిప్ప పల్గె' సామెత వర్ణించు చున్నది ఈ వృత్తిలో చేరిన

కొత్తవారు బ్రాహ్మణ సమారాధన యాచిస్తారని, వారి కొత్త మోజును ఈ 'కొత్త బిచ్చగాడు పొద్దెరుగడు' సామెత వివరించుచున్నది. వారు భిక్షాటనకు 'జోలె' (సంచి) ఉపయోగిస్తారని 'సంచులు సగవెట్టి సరికి బిచ్చపోళ్ళు ఎత్తిపాయె' సామెత వర్ణించుచున్నది.

మంత్రసాని వృత్తి :

వైద్యసదుపాయము అందుబాటులో లేని గ్రామీణ సమాజము నందు పూర్వకాలము నుండి, ప్రసవ సమయమున స్త్రీలను కాపాడు పనిని అనుభవజ్ఞులైన స్త్రీలు స్వీకరించి దానిని వృత్తిగా చేసుకొని జీవించేవారు వీరిని 'మంత్రసానులు' అని వ్యవహరించేవారు; కష్టదశలోని స్త్రీలను వీరు కాపాడే వాళ్ళు కాబట్టి, వీరు శక్తివంతులని గ్రామీణుల నమ్మకము; వీరు, స్త్రీలకు సుఖ ప్రసవము చేయుటలో అసహ్యపడక వృత్తి ధర్మము నిర్వహింతురని ఈ 'మంత్రసాని తనానికి ఒప్పుకున్నాక ఎదొచ్చినా పట్టాలి' సామెత వివరణ.

ధనిక పేద భేదములు :

మానవ సమాజము నందు ధనికులు-పేదలు అను రెండు వర్గములు కలవు ధనికులకు సమాజము నందుగల విశిష్టమగు గౌరవము పేదవారికిలేదు ధనము వారియొక్క విలువను పెంచుతున్నది. పేదవారిని అదే నిరసించుచున్నది. ఈ తారతమ్యములు గల వ్యక్తుల గురించి జానపదులు తమసామెతలందు వివరించినారు. 'కాలు మీద కాలు రాజగోపాల్' ఈ సామెత యందు ఉన్నవారి యొక్క స్థితిని వివరించినారు. 'డబ్బు' ఉన్నవారు సుఖముగా జీవింతురు వీరు కష్టపడి సంపాదించ వలసిన పనిలేదు. కావున శారీరక శ్రమ చేయరు. వీరి తాత తండ్రులు సంపాదించినది ఉన్నచో, ఇంక వేరే చెప్ప పనిలేదు.అటువంటి భాగ్యవంతులు,కాలు మీద కాలు వేసుకొని హాయిగా కూర్చుండి, రాజకుమారులవలె జీవింతురు,అను విషయమును వివరించినారు.

కొందరు డబ్బు గలవారి ఆడంబర జీవితము చూచినచో ఆశ్చర్యము కలుగును. వారి జీవితము నందలి ఆడంబరమును ఈ 'అయ్యగారికి అరెడ్లు

మూడు దొడ్లు' అను సామెతన వివరించినారు. వీరు కొద్దిఖర్చు చేయుచోట అధికముగా వెచ్చించి, ఆడంబరము ప్రదర్శింతురు.

ధనవంతుల తప్పిదములన్నియు, వారి ధనము క్రింద దాగిపోవును. వారికి సమాజమున గల విలువ అటు వంటిదని, వారు అసత్యము చెప్పినను అది సత్య మవునని ఈ "పెద్ద చెరువు కంపు పెద్దొల్ల బొంకు' అను సామెతన వివరించినారు. చెఱువు నందు కంపు ఉన్న అది పెద్దది కాబట్టి అంతగా పట్టించు కొనరు. దాని పెద్దరికము వలన, అది కప్పబడిపోవును.

పేదవారి గురించి కూడ ఎన్నియో సామెతలు గలవు. పేదవాడనిన సంఘమునకు లోకువ. ఈ విషయమును 'పేదోనికి పెండ్లాముంటె ఊరంత మొగులే'అను సామెత యందు దీనముగా పేదవాని భార్యను కూడ సంఘము ఎంత లోకువగా చూచుచున్నదో వివరించినారు.

పేదవారిలో ఎక్కువమంది శారీరక శ్రమ తో జీవించుదురు. వారు దిన మంతయు చేసినగాని కడుపు నిండదు మరికొందరికి ఒక్కపూట భోజనము కొందరు దీనులు కొన్నిరోజులు పస్తు ఉండుట మామూలు. ఈ విధమగు వీరి జీవితము 'పొద్దుందాక చేసినా బొంతల పొగచూరదు' అను సామెత యందు వర్ణించిరి.

అదే విధముగా మరి కొంత మంది కడుపుకు యింత తిండి కొరకు ఎంతయో శ్రమింతురు. మరికొందరు ఎన్నియో భయంకరమగు పనులు చేసి, పాములను ఆడించి, సంపాదించి జీవింతురని ఈ 'కడుపు తిప్పలకు జట్టిపోతు లాడించిరి' సామెత యందు వివరించిరి

వ్యవసాయ కూలీలు 'కల్లమున్న నాళ్లొద్దులు గంజి, అంగడున్న నాళ్లొద్దులు ఉప్పు' అను విధముగ జీవింతురు అనగా వారి జీవితమున ఏపూట సంపాదన ఆ పూటకే సరిపోవునని కళ్ళమున్న రోజులు, పంటలు పండి వడ్లు అందరి ఇండ్లకు చేరునపుడు, వారికి కొంత పనిదొరికి ధాన్యము వచ్చును అప్పుడు గంజిని మాత్రము త్రాగి జీవింతురు. 'అంగడి' అనగా 'సంత' జరుగునన్ని రోజులు మాత్రము అందు ఉప్పునుకొని వాడుకుందురని,లేనిరోజు అది కూడా ఉండదనియు వారి జీవన స్థితిని దీనముగా వివరించినారు.

ఈ విధముగా తమ సాహిత్యము యందు జానపదులు,ధనవంతులగురించి పేదవారిని గురించి వర్ణించినారు.

మతము :

అనాది కాలము నుండియు, మానవ జీవితము 'మతము' తో పెనవేసు కొనిపోయినది. 'దేవుడు, ఆత్మ, సృష్టి, పుణ్యపాపములు, అదృశ్యశక్తులు, మంత్రతంత్రములు, జగత్తు, నమ్మకములు, ఆచారములు, పండుగలు, మొదలగునవి ఎన్నియో ఈ మతమను పునాది పై నేర్పడినవి. వీటన్నింటి యొక్క సిద్ధాంతముల సమ్మేళన రూపము మతము.

'మతము విశ్వాసము యొక్క ఉచ్ఛందము'21 అనినిర్వచనము గలదు

'మతము అను పదమునకు సమ్మతమైనది. అనగా ఇచ్ఛ, బుద్ధి, జ్ఞానము అను అర్థములు కలవు.' శ్రద్ధ' విశ్వాసమును మతము 'అనుట తెలుగులో రూఢి అయినది. కొన్ని భారతీయ భాషలలో దీనినే 'సంప్రదాయం' మందురు. ఇది మనుషులను కట్టడిలో ఉంచునది' 22

'జన్మ మృత్యు ప్రాదుర్భావ వివాహాది జీవిత మందలి కీలక సంఘటనల ఉద్దేశపూర్వక అనుభవములు. సహజ ప్రవృత్తులు, తీరనికోరికలు ఇవన్నియు ఏదో ఒక విధముగా మత విశ్వాసములను, క్రతువులను నిర్మించునని ఫ్రేజర్, హొరివెల అభిప్రాయము'.23

'మత సత్యము లన్నియు సంఘముచే సృష్టింపబడినవి. గుంపులో నొకడుగా నున్నప్పుడు కలుగు ఉత్సాహము,శక్త్యాధిక్యము,ఉన్మాదోద్రేకము మత విశ్వాసములను, క్రియలను సృష్టించినవని దుర్ఖెమ్ సిద్ధాంతము' 24

'అనాగరికుడగు నాదిమ మానవుని అందు మిక్కిలి బలవత్తరమగు భావము, భీతి మరణించిన వారనిన అతనికి గల భయము క్రమముగ అతనిలో మత విషయక భావము లేర్పడుటకు దారి తీసెను' 25 - అని సామా- జిక శాస్త్రవేత్తల అభిప్రాయము.

'ప్రాచీనుల పూజయే కాలక్రమమున మతముగ పరిణమించిందని'26 స్పెన్సరు అను సామాజిక శాస్త్రవేత్త అభిప్రాయము.

మానవ శక్తికి మించిన మరో శక్తి ఈ సృష్టి యందు కలదని ప్రాచీన మానవుని నమ్మకము. ఆ శక్తియే 'దేవుడు' అను పేరుతో పిలవబడెను. దేవుని యొక్క శక్తి అపారము, అతని దయవలన, ఎన్నో పనులు నెరవేరును. అతడే ఈ సృష్టికి మూల పురుషుడు, అతడు నడిపించునట్లు మానవజీవితములు నడచును. అతడి తృప్తి గురించి ఎన్నో పవిత్రమగు పనులు చేయుదురు. దేవునకు, ధర్మమునకు భిన్నమగునవి పాపములు. వారు చేసిన పుణ్యపాపములను బట్టియే దేవుడు వారికి స్వర్గము, నరకములలో స్థానమేర్పరుచును వీనిని అనుసరించియే. దేవుడు వారి జీవిత విధానము నిర్ణయించును. అను మున్నగు నమ్మకములు ఎన్నియో దేవుని చుట్టు ఏర్పడినవి, వాటిలో కొన్నింటిని జానపదులు, తమ సామెతలలో, తమకు అర్థమయిన రీతిగా వివరించినారు.

'దేవుడు ఆగాయించే దెవకొలాయించే' ఈ సామెత యందు దైవానుగ్రహము పొందిన వారికి జీవితమున ఉత్తమ దశ వచ్చునను విషయమును వివరించినారు.

'మతమునందు 'దేవతారాధన' మునకు ప్రాధాన్యము గలదు. వారి వారి నమ్మకము లను అనుసరించి, పురాణములందు ధర్మశాస్త్రము లందు, ఇతి హాసములందు సృష్టింపబడిన ఎందరో దేవతలను కొలుచుట ప్రారంభింపబడినది. ఆయాదేవతలకు సంబంధించి, ఆయా మతములు ఏర్పడినవి. ఈ మతముల గురించి, జానపదులు తమ సామెతల యందు వివరించినారు

వైష్ణవమతము :

విష్ణువు యొక్క ప్రాధాన్యతను అంగీకరించు మతము అందులో కొన్ని సమయములందు 'భక్తి' విషయమున కట్టు బాటులు సడలించుట వలన 'వాలంటీరు వైష్ణవ్యం' పసరికీరు వైష్ణవ్యం వంటి విమర్శనాత్మక అభిప్రాయము ను వెలువరించు సామెతలు పుట్టినవి.

## శైవ మతము :

శివుని విశిష్టతను అంగీకరించు మతము. ఈ మత సిద్ధాంతమును 'వంకాయ వంటి శాకం లేదు శంకరుని వంటి దైవం లేదు' సామెతన వివరింపబడినది.

ఒక వ్యక్తికి బలవంతముగ 'లింగము' కట్టినంత మాత్రముచేత శివ భక్తుడుగా మారిపోడనియు, అతని హృదయము నందు భక్తి ఉండుట ప్రధానమని ఈ 'బలిమీటికి లింగంకట్టె భక్తుడు కాదు' సామెతన వివరణ.

అదే విధముగా 'పట్టి పట్టి పంగనామాలు పెట్టె గోడచాటుకు పోయి గోకేసుకున్నడట' అను సామెత యందు వైష్ణవులు ధరించు 'పట్టినామములు' దేవునిపై భక్తిలేనిదే, బలవంతముగా పెట్టగా అతడు గోడదాటుకు వెళ్ళి చెరిపి వేసుకొనినాడట. ఈ సామెతలు, బలవంతముగ. జరిగిన శైవవైష్ణవ మత మార్పిడుల సందర్భాలను వివరించుచున్నవి.

'భక్తి' అనునది రానురాను కేవలము, తమ స్వప్రయోజనములను తీర్చుకొనుటకు ప్రదర్శింపబడుచున్నది. ఏదైనా ఆపద రాగానే, దేవుని ఆరాధించుట, వారి పనులు నెరవేరుటకు వేడుకొనుటయు. ఆ పని నెరవేరగానే దేవుని మరచి పోవుట జరుగుచున్నదను, విషయమును ఈ'ఆపతి మొక్కులు సంపతి విడుపులు' అను సామెతన వివరించినారు.

దేవుని మహిమ వలననే,అతడు మానవుల నుదుటి పైన వ్రాసిన జీవన విధానము ననుసరించియే మానవుల జీవితము నడచుచుండునను విశ్వాసము గలదు. దీనినే 'విధి లిఖితము' 'దైవలిఖితము' అని అందురు. మానవులు తమ ఊహలందు ఎంతో ఉన్నతముగా జీవించవలయునని ఆశింతురు. కాని వారి నుదుటి పైన భగవంతుడు దానికి విరుద్ధముగా కూడ వ్రాసి యుండ వచ్చునని అది జరిగి తీరునను విశ్వాసము 'నోరు మాట్లాడితే నొసలు ఎక్కిరించింది' సామెతన గమనింపవచ్చు.

మానవులకు పూర్వ జన్మ కలదనియు అందు తాము చేసిన పుణ్యపాప ముల ననుసరించియే వర్తమాన జీవిత విధానము నిర్ణయింపబడి ఉండునని నమ్మకము 'పుణ్యమనగా హితములగు భౌతిక, నైతిక,అధ్యాత్మిక క్రియలుగ చెప్పబడినవి.పాపమనగా అహితములగుభౌతిక,నైతిక, అధ్యాత్మిక దోషములు లేదా లోపములు (Evils) అని వివరింపబడినది.'27

గత జన్మలోని పుణ్యముల ననుసరించి ఈ జన్మయందు జరుగు శుభముల గురించి ఈ 'పుణ్యం కొద్ది పురుషుడు పూజకొద్ది బిడ్డలు' అను సామెత వివరించుచున్నది.

మతము నందు కర్మకాండకు ప్రాధాన్యత కలదు. మానవులు మృతి నొందిన పిదప వారి ఆత్మ పంచభూతములందు లీనము కాగలదు. ఆత్మ అనగా 'అదికాదిదికాదు' అని చెప్పబడుచున్నదో అది 'స ఏష నే తినే త్యాత్మా' అని బృహదారణ్య కోపనిషత్తు 28 వివరించుచున్నది

మృతి నొందిన వారి ఆత్మల తృప్తి వరచు బాధ్యత వారి వారసులపైనే కలదు. అందుచేత వారు శ్రాద్ధాది కర్మలు నిర్వహింపవలెను వ్యక్తులు మృతి నొందిన రోజున గల తిధి ననుసరించి వారికి ప్రతి సంవత్సరమున శ్రాద్ధ క్రియ నిర్వహింపబడును. శ్రాద్ధక్రియను 'తద్దినము' అని కూడ అందురు, అది బ్రాహ్మణ జాతి యందు శాస్త్రోక్తముగా జరుపబడును. తదితర కులస్థుల యందు వారివారి ఆచారముల ననుసరించి యథాశక్తి 'తద్దినము' రోజున బ్రాహ్మణులకు భోజన పదార్థములను 'సాయిత్యం' అను పేర పంపుదురు. దీనిని వారు 'పెద్దలకు బియ్యమిచ్చు రోజు' అందురు. . పెద్దలు అనగా బ్రాహ్మణులు. వారు తృప్తిగా తినినచో చనిపోయిన తమ పెద్దలు తిని తృప్తి పడు నటుల భావింతురు.

'తల్లినన్న చూపెట్టు తద్దినమన్న పెట్టు' అను సామెత యందు శ్రాద్ధ క్రియ ప్రస్తావన గమనింపవచ్చును

'ముందుకోప పెల్లినోడు మాసికాని కొచ్చిండు'ఈసామెతన మాసికమను శ్రాద్ధక్రియ ప్రస్తావింతబడినది మాసిక మనగా వ్యక్తి మృతి నొందిన సంవత్సరపులోపున ప్రతినెల నిర్వహించు శ్రాద్ధక్రియ.

ఆచారములు :

మన సంస్కృతి యందలి సంప్రదాయ సిద్ధమగు పనులు ఆచారములు అవి మత విశ్వాస ప్రాతిపదికములు. మానవులకు కొన్ని పనుల యందు నమ్మకము ఉండుట వలన వానిని అందరూ తప్పక ఆచరించు అలవాటు ఏర్పరచుకొందురు. అవియే ఆచారములు.

'విభిన్న అభిప్రాయములు, అనుభూతులు, మానవునిలో పొడసూపి నపుడు అనుభవంలో కొన్ని సమష్టి అభిప్రాయాలు యేర్పడుతాయి. అవిక్రమంగా అలవాట్లుగా మారుతాయి. సమాజంలో నేడు మనం చూస్తున్న సమష్టి సంప్రదాయాలు, అలవాట్లు యిలా రూపొందినవే'29 అని హ్యూమ్ పండితుని అభిప్రాయము.

'ఆచారమనునది జీవితమును క్రమబద్ధమగు పరివర్తనలో ఉండునట్లుగా సేవ చేయును'30 అని అభిప్రాయము కలదు ఆచారమగు మానవజీవితమున మానవు లందరి యందు ఒకే విధమగు, సంప్రదాయ సిద్ధమగు కట్టుబాటు ఏర్పడుటకు కారణమయినది.

'ఆచారములు అలవాట్లను, అలవాట్లు ఆచారములను సృష్టించునని'31 తెలియుచున్నది.

'అలవాట్లు ఆచారములకు దారిచూపును'32 అను అభిప్రాయము కూడ కలదు

సంప్రదాయము నుండి ఆచారము వచ్చినది.

సంప్రదాయమనగా పెద్దలు మన కిచ్చినది. పెద్దల నుండి మన ముందు కొనినది'33 అని అభిప్రాయము. అనగా ఈ ఆచారము లన్నియు, వారసత్వ ముగా మనకు మనవారి నుండి సంక్రమించినవి. ఈ ఆచారములందు, చాలా భాగము, మత పరమగు విశ్వాసములకు రూపములు, మరి కొన్ని, లౌకిక జీవితమందలి పనులపై గల నమ్మకములు కలవు.

ఈ ఆచారములు ప్రతి సంఘమువందును, ప్రతి జీవితము యందును అగుపించుచుండును. వీని యొక్క సమగ్ర స్వరూపము, గ్రామీణ జీవితము అందు నేటికిని కొంత వరకు గమనింపవచ్చును గ్రామీణులు తమ సాహిత్యము నందు వీనిని గురించి చాలచోట్ల వివరించినారు సామెతల యందును,వారు తమ ఆచారములు వర్ణించినారు.

'ఆచార మూరువాళ్ళు అనాచారం నూరు వాళ్ళు' ఈ సామెత యందు ఆచారమను పేర జరుగు అనాచారమును విమర్శించినారు వేమన వంటి నిశిత దృష్టి గల జానపదుని సృష్టి ఇది.

కొందరు 'మడి' అను ఆచారమును పాటింతురు. 'మడి' కట్టుకొనుట అనగా శుచియై, శుభ్ర వస్త్రము ధరించుట యైనను కొంతకు ప్రతిలోను ప్రత్యేకమగు ఒకే వస్త్రము ధరించి 'మడి' అనుట గలదు. 'మడి' కట్టు కొనినవారు. మడి కట్టుకొనని ఇతరులు తాకినచో తాము 'మైల'పడిపోదుమని భావింతురు. ఈ కట్టుబాటు తమ యింటిలో చెల్లును గాని, వలుగురిలో సాధ్యము కాదు. అది గమనింపని ఒక చాదస్తపు మనిషి అనుభవము ఈ 'మడి గట్టుకొని మైలారం పోతే మళ్ళొచ్చే సరికి అల్లు కాలిపోయె' సామెత.

మత సంబంధ మగు ఆచారములు ఇవి అనువంశికముగా అచరణమున గలవి. మత పరమగు విశ్వాసముల ననుసరించి వెలసినట్టివి. ఇందు దేవుడు. గృహచారము. శ్రాద్ధ క్రియలు మొదలగునవి కలవు

'అల్లుడు రాలేదని అమాసాగుతాది' ఈ సామెత యందు ఒక సంప్రదా యము గురించి వివరింపబడినది తెలుగు దేశమున పెండ్లి అయిన పిదప వచ్చు తొలి పండుగలకు ముఖ్యముగా 'దీపావళి'కి అల్లుళ్ళు అత్తవారింటికి వచ్చుట, దీపావళి కట్నములు స్వీకరించుట ఆచారము ఈ సామెత యందు దీపావళి 'అమావాస్య' రోజు అల్లుడు రాలేదనియు, అయినను అమావాస్య ఆగిపోలేదనియు వివరించిరి.

'అందర్ని మించుడు అల్లున్ని తెచ్చుకు' ఈ సామెత యందు 'వరకట్నమను' ఆచారమును వర్ణియబడినది. ఈ ఆచారము వలన, ఇంటి

యాజమాని, తన కూతురు పెండ్లికి పడరాని పాట్లుపడి, చేయరాని పనులు చేయవలసి వచ్చునని విమర్శ కూడ కలదు.

'శుభం పలుకరా పెండ్లికొడుకా,అంటే అయిరేని కుండకు తొర్రి అన్నాడట' వివాహమనునది పవిత్ర కార్యము దానిని శుభముగా ఆచరింపవలయును. వివాహమందు అయిరేని కుండలు ఉంచుట అను ఆచారము గురించి వివరింప బడినది అయిరేని కుండలనగా పంచవర్ణములతో 'చిత్తరువులు' చిత్రించిన (అలంకరించిన)కుండలు వీనిని వివాహ వేదికవద్ద ఉంచుదురు ఈ విధముగా ఆచరించుట మంగళకరము సౌభాగ్య ప్రదము అను నమ్మకము కలదు. వీని పట్ల అపచారము కూడదని అశుభము పలికిన ఒక పెండ్లి కుమారుని స్వభావమును వివరించినారు.

బ్రాహ్మణులందు బాలురకు వారి పన్నెండవ ఏడు 'ఉపనయనము' జరుపుదురు'ఉపనయనమనగా వటువు ఆచార్యుని పొందుచేరుట అనిఅర్థము'[34] ఈ రోజున వటువుకు గాయత్రి మంత్రోపదేశము గావించుదురు. దీనితో ఈ బాలురకు మత సంబంధమగు విధులను నిర్వహించుటకు అర్హత సిద్ధించును. ఉపనయమునందు కూడ వివాహమునందు గల విధులన్నియు ఉండును. వధువు మాత్రము ఉండదు. కావున అగ్రజులు వివాహమునందే అనుజుల ఉపనయన కార్యక్రమము నిర్వహించుట సులభమని భావింతురని ఈ'పీరిగాడి పెండ్లిలో పీరిగాడికొక జంజంపోస' అను సామెతన వివరించిరి.

ఉపనయన ప్రధానోద్దేశము సావిత్రి మంత్రోచ్చారణ, యోగ్యతాసిద్ధి పూర్వకమైన అధ్యయనాధికార సిద్ధి'[35]ఆగుట వలన ఉపనయనమున ధరించిన యజ్ఞోపవీతములకు విలువ నీయవలయునని గాయత్రి జపించవలయునని అట్లు చేయని వారి ప్రవర్తన ఈ 'అయ్య గారి జంజాలు అయ్యగారికి ముదుపు' సామెతన విమర్శించుట కలదు.

'పసుపు కుంకుమకోసం పదామడైన పోవాలి'అందు స్త్రీలు పేరంటము నకు ఇచ్చుప్రాధాన్యము వివరించబడినది.పసుపు,కుంకుమ,మంగళసూత్రము, గాజులు, చెవికమ్మ ఈ ఐదు పెండ్లయిన స్త్రీకి మంగళప్రదమగు 'ఐదు పన్నెలు' అని ప్రాచీన ధర్మశాస్త్రములు వివరించుచున్నవి వీని సంరక్షణ

ఆశించియే స్త్రీలు నోములు ఆచరించుట పేరంటమునకు వెళ్ళుట ఆచారము పేరంటములను తెలంగాణమున 'పసుపు కుంకుమలు' అందురు.

'ధర్మపురి మంగలోని తీరుగ సగం గొరిగిండు' సామెత యందు తెలుగునాట యాత్రలకు వెళ్ళిన భక్తులు, తమ కోరికలను తీర్చినందులకు భగవంతునికి తలనీలాలు సమర్పించు ఆచారము కలదు. ఈ కార్యక్రమము దైవ స్థలము అందు జరుపుదురు పై సామెత యందు ధర్మపురి పుణ్యక్షేత్రమున తలనీలాలు అర్పించునపుడు జరిగిన మంగలి తొందర పాటు పనిని విమర్శించుట గలదు. ధర్మపురి తెలంగాణమునగల సుప్రసిద్ధ నృసింహ దైవక్షేత్రము.

పండుగలు :

సంస్కృతి సంప్రదాయము అందించిన వేడుకలు పండుగలు పుణ్యము పురుషార్థము ఆనందము వినోదము ఏకోన్ముఖముగా అందించు ఆచారములు ఈ పండుగలు ఆవిమతమునకు చెందినవి కావచ్చును లేదా లౌకిక జీవితమునకు సంబంధించినవి ఆయివుండవచ్చును. ఈ విధముగా పలు విధములగు పండుగలు తెలుగునేల నలుచెరుగుల కనిపించుచున్నవి.

ఉగాది :

తెలుగు వారికి ఉగాదితో పండుగలు ప్రారంభమగును. అందువలన ఉగాది తొలిపండుగ. ఇది చాంద్రమానము ననుసరించి చైత్రశుద్ధ పాడ్యమి రోజున వచ్చును. ఈ రోజు నూతన వర్ష పంచాంగమును పూజించుట ఉగాది పచ్చడి స్వీకరించుట విందూ భోజనముతో సందడిగా జరుపుకొందురు.

మహాశివరాత్రి :

శివరాత్రి పర్వదినము మాఘ బహుళ చతుర్దశి రోజు జరుపు పండుగ ఈ రోజు శివభక్తులు ఉపవాసము ఉండి, రాత్రి 12-00 గంటలకు లింగోద్భవ కాలము వరకు జాగరణ చేయుట కలదు.

ఈ రెండు పండుగల యందు ఉగాది ఏ మాత్రము శ్రమ లేని ఆహ్లాదమగు పండుగ, కనుక ఉన్నరోజు ఉగాదిగా భావించ వలెననియు లేనిరోజు శివరాత్రినాటి ఉపవాసము, జాగరణకు వలె లేనిరోజులు గడుచునని తమ ఆర్థిక జీవితమును పండుగ రోజుల పోలికతో వివరించుట ఈ 'ఉన్ననాడు ఉగాది లేన్నాడు శివరాత్రి' అను సామెతన కనిపించును.

### సంక్రాంతి :

సంక్రాంతి పండుగ మార్గశిర పుష్య మాసములందు వచ్చు పంటల పండుగ. ఈ రోజు వరకు పంటలు ఇంటికి చేరును. ఉత్తరాయణ పుణ్యకాలమగు అదే, వైష్ణవులకు పరమ పవిత్రమగు రోజులగుట వలన ఈ పండుగకు ప్రాముఖ్యము కలదు. తృప్తికరమైన ఆనందము సంవత్సరమునకు ఒకసారి మాత్రమే చేకూరునను విషయమును ఈ 'సంక్రాంతి సాలుకొకమారే' అను సామెతన వివరించిరి.

### దీపావళి :

దీపావళి పండుగ ఆశ్వయుజ బహుళ అమావాస్యనాడు వచ్చును. దీనిని జానపదులు 'దివిలి' 'దివెల' పండుగ అందురు. ఈ రోజు సత్యభామ ద్వితీయుడై కృష్ణుడు నరకుని వధించినందులకు సంతోషముతో పండుగ జరుపుకొందురు. టపాకాయలు కాల్చుదురు టపాకాయలు కాల్చగా వచ్చు ఈ శబ్దములను లౌకిక జీవితమున ఒక భర్త భార్యను దండించినప్పుడు వచ్చు చప్పుడుతో పోల్చి హాస్యముగా ఈ 'డిందాం దివ్వెల పండుగ' అను సామెతన వివరించిరి.




### విజయదశమి :

విజయదశమి పండుగను 'దసరా' అనికూడ అందురు. ఆశ్వయుజ శుద్ధ దశమి రోజు జరుపుకొందురు. జానపదులయందు జాము తీసుకొనిన అప్పును, తిరిగి చెల్లించుటకు గడువుగా పండుగ రోజులు నిర్ణయించుకొందురు

గడువు నిర్ణయించుకొనిన పండుగలలో దసరా ఒకటి అని ఈ 'దసరాదనక అసలు లేదు దసరెన్క మిత్తిలేదు' అను సామెత వివరించుచున్నది.

కృష్ణాష్టమి :

కృష్ణాష్టమిని 'ఉట్లపండుగ' అనుటగలదు ఇది కృష్ణుని జయంతి. శ్రావణ బహుళాష్టమి రాత్రి రోహిణీ నక్షత్రమున జరుపుదురు. ఉట్లనుకొట్టి వెన్నను దొంగిలించుటకు గుర్తుగా ఈ రోజు ఉట్లనుకొట్టు కార్యక్రమము సందడిగా నిర్వర్తింతురు. ఈ సంబరము ఉన్ననాడు మాత్రమే సందడిగా జరుపుకొనుట వీలగునని, లేనిరోజు 'లొట్లపండుగ' అనగా తప్ప తాగి పడు కొనుటయే అనియు ఈ 'ఉన్ననాడు ఉట్ల పండుగ లేన్నాడు లొట్లపండుగ' అను సామెత యందు వివరించిరి.

కొత్త :

'కొత్త' అను పండుగ తెలంగాణమున జరుపుదురు. ఈ పండుగ క్రొత్త ధాన్యమును వండుకొని తినురోజు. ఇది సంవత్సరమునకు రెండుమార్లు క్రొత్త పంట వచ్చిన పిదప జరుపుదురు. ఇది వ్యవసాయదారులకు ఇష్టమగు పండుగ ఈ పండుగ జానపదులు దృష్టియందు 'తల్లి' వంటిదని ఈ 'కొత్తంత పండుగ లేదు తల్లంత దయలేదు' అను సామెతన వివరించినారు.

పీరీల పండుగ :

మొహర్రమ్, పండుగను 'పీర్ల పండుగ' అందురు. 'పీరి' అనునది మొహర్రం నాడు ఊరేగించు హుసేన్ ధ్వజ చిహ్నము. ఈ రోజు ప్రవక్త మహ్మద్ మనుమడు హుసేన్ మరణించిన రోజు,ముసల్మానులకు శోక దినము కాని ఇది పండుగగనే వ్యవహరింపబడుచున్నది. ఊదు వెలిగించిన పిదపనే. పీరీలను ఊరేగింపునకు లేపనెత్తుదురు. ఈ విషయమును 'ఉదుకాలందు పీరి లేవదు' అను సామెతన వివరించినారు.

ఈ విధముగా తాము జరుపుకొను పండుగల గురించి జానపదులు తమ సామెతలందు వివరించిరి.

శకునములు :

శకునము అనగా'పక్షి సంకేతము'అను అర్థము గలదు.కొన్ని పక్షులు, జంతువులు ఎదురైనచో మంచి జరిగిన అది శుభ శకునమనియు, చెడు జరిగినచో అది అపశకున మనియు నమ్మకము గలదు. శుభకార్య నిమిత్తము వెళ్ళుటకు బయలుదేరగా,'విధవ'ఎదురగుచో ఆ కార్యము సఫలము కాదనియు అశుభశకునమనియు నమ్మకములు గలవు.అదే విధముగా పిల్లి ఎదురుపడినను, అపశకునముగా పరిగణింతురు. ముత్తైదువ ఎదురగుచో శుభముగా భావింతురు.

'తీర్థంపోతూ పిల్లిని చంకన పెట్టుకున్నట్టు' తీర్థయాత్రలకు పోవుట పవిత్రమగు ఆచారము. దీనికి వెళ్ళుచు, అశుభ చిహ్నము, అపశకున జంతువు అగు పిల్లిని తీసుకపోవుట అనునది హాస్యాస్పదము అను వ్యంగ్యము ఇందు కలదు. 'పెండ్లికి పోతూ పిల్లిని చంకన పెట్టుకున్నట్టు' అను సామెత అటు వంటిదే.

'ఎడమనించి కుడికిపోతే పిల్లి, కుడినించి ఎడమకైతే తల్లి' అని పిల్లి ఎదురగు వేళ, అది పరుగెత్తు దశలను అనుసరించి శుభాశుభములు జరుగునని వివరించబడినది. మనిషికి ఎడమ ప్రక్కనుండి కుడికి పరుగెత్తినచో అది పిల్లివలె అపశకున ప్రభావము చూపి అశుభము చేయుననియు, కాని అది కుడి ప్రక్కనుండి ఎడమవైపునకు వెళ్ళినచో తల్లిలా శుభము చేకూర్చునని వర్ణించిరి.

నమ్మకములు :

మానవునకు ఒక దానిపై ఏర్పడు మంచి చెడు అభిప్రాయములే నమ్మకములు. ఈ నమ్మకములు మానవజీవితమునందు ఎంతో ప్రాముఖ్య

కలవి. 'విశ్వాసము మనిషి ప్రవర్తన పైద ప్రభావము చూపును' అని అభిప్రాయము కలదు'36 ఈ నమ్మకములు మత పరములు, లౌకిక విశ్వాసములు అని రెండు విధములు.

జానపదులు తమకు గల నమ్మకములను కొన్ని సామెత లందు వివరించిరి.

## i మతవిశ్వాసములు :

విధిలిఖితము మిక్కిలి బలవత్తర మగునది 'త్రిమూర్తులకు, దేవతలకు కూడ మదిటి వ్రాత మార్చ తరము కాదు'37 అని గీత ప్రవచించుచున్నది. విధాత మానవుని నుదుట అతని ఇహలోక యాత్రకు సంబంధించిన కార్యక్రమములను వ్రాయును. దానిని అనుసరించి వాని జీవితము నడచును. ఈ నమ్మకమును 'నోరందల మెట్టు దాముంటె నొసలు కట్టెలు మోద్దామన్నదట' అను సామెత వివరించుచున్నది.

మానవులు విధి వ్రాతను గుర్తింపక తాము స్వతంత్రముగా ఎన్నియో ఊహింతురు. కాని అవన్నియు నుదిటి వ్రాత వెక్కిరింతతో వెంవెంటబోవును. ఈ అభిప్రాయము 'నోరు మాట్లాడితే నొసలు ఎక్కిరించింది' అను సామెత స్పష్టము చేసినది.

'దేవుడు లగాయించె దెసకొలాయించె' మానవులు దైవమునకు తల వంచక తప్పదు. తమ జీవితము నందలి సుఖ దుఃఖములకు ఆ దేవుని నిర్ణయములు కారణము. దేవుని అనుగ్రహము వలననే జీవితము నందలి మంచి, చెడు దశలు మారునను నమ్మకము ఈ సామెత వివరించినది.

మానవులు గత జన్మన చేసిన పుణ్యముల ననుసరించి వర్తమాన జీవితమున అనుకూలమగు ఆశించిన జీవితము లభ్యమగునని ఈ 'పుణ్యం కొద్ది పురుషుడు పూజకొద్ది బిడ్డలు' అను సామెత వివరించుచున్నది.

'వచ్చే గండం వచ్చినా తప్పదు' విధాత నిర్ణయించిన కాల పరిమితి ననుసరించి మానవులు జీవింతురు. ఈ పరిమితి ముగియగనే ఏదో ఒక గండం వారిదరి చేరుననియు దానిని తప్పుకొన సాధ్యము కాదను నమ్మకము ఇందు వివరింపబడినది.

దేవుడు మానవుల యొక్క చావు నిర్ణయించుటతోపాటు వారు మృతి నొందు చోటు కూడ నిర్ణయించునని కాలము సమీపించువేళ వారి పాదములు వారిని బలవంతముగా మృతి నొందు చోటికి తీసుకొని వెళ్ళునను నమ్మకము ఈ 'పణత పదేజాగలకు పాదాలు గుంజుకపోతయి' అను సామెతన స్పష్టము.

## ii లౌకిక విశ్వాసములు :

వివాహ సంబంధము ఏర్పరుచుకొనుటకు మగ పెండ్లివారు,ఆడ పెండ్లి వారిచే ఆహ్వానింపబడుదురు. ఈ సమయమున పెండ్లిచూపులు జరుగును. తదుపరి నచ్చినచో వివాహ విషయములపై ఒప్పందములు చేసుకొందురు. ఈ వేళ మగపెండ్లివారు, ఆ ఇంట భుజింపరాదనియు, భుజించినచో సంబంధము కుదురదనియు విశ్వాసము కలదు. దీనిని ఈ 'గతికితే అతకదు' సామెత వివరించినది.

మానవులకు వారి యొక్క గృహనిర్మాణము ననుసరించి, జీవితమున సుఖదుఃఖములు ఏర్పడునను. విశ్వాసముగలదు. దీనిని ఈ 'మందిని మింగే ఇల్లుండాలి, ఇల్లును మింగె మందుండొద్దు' అను సామెతన వివరించిరి. ఇందు ఇల్లు విశాలముగా ఉండవలయునని చెప్పబడినది. ఇది ఆరోగ్య విషయమున మంచి నమ్మకము.

'మందుకు పత్తెం, మాటకుసత్తెం' మందును స్వీకరించుటకు మాటాడు టకు మానవుడు పాటింపవలసిన నియమములుగలవను విశ్వాసము ఈ సామెత స్పష్టము చేయును.

'షష్ఠినాడు దాకలో దైన వయనం చేయుదు' స్త్రీలకు ప్రయాణ సంబంధ మగు విశ్వాసములు చాల కలవు. వీరు కొన్ని తిథుల యందు ప్రయాణము

చేయరు. 'షష్ఠి, అష్టమి, నవమి' అను వంటి తిథులు ఈ రోజులందు ప్రయాణం అశుభమును, ఆపదను కలిగించునను విశ్వాసము కలదు. దానిని ఈ సామెత వివరించుచున్నది.

'దారంలేని సూది దయ్యమెత్తుకపోతది' సాధారణముగా సూదిని దార పుండకు పెట్టి ఉంచుదురు. అట్లు కాక అది విడిగా ఉంచినచో దారము పెట్ట వలయును. లేనిచో అది పడిపోయిన గుర్తించుట కష్టము. ఈ అభిప్రాయము ఈ సామెత వివరించుచున్నది.

ఇంటికి అతిథుల రాకను, కాలు దురద పెట్టుట, కొయ్య ముసురుట చీపురు క్రింద పడుట, వంటి సంకేతములు తెలియజేయునని విశ్వాసములు కలవు. వీనిలో కొన్ని ఈ సామెతలు వివరించుచున్నవి.

'ఎడమకాలు గులగుల పెడ్తె ఎవరైన వస్తరు'

'కుడి కాలు గులగుల పెడ్తె తుక్కకూడ రాదు'

## నీతి నియమములు :

మానవ జీవితమున 'నీతి'కి అధిక ప్రాధాన్యము కలదు. మానవుని నైతిక విలువలను బట్టియే అతనికి సంఘమున గౌరవము కలదని ప్రాచీన ధర్మశాస్త్రములు వివరించినవి. నీతి మానవులకు సత్ప్రవర్తనాది ఉత్తమ జీవితవిలువలను ప్రతిపాదించు ధర్మము. మానవులను సన్మార్గమున నడువ వలయునను సదుద్దేశముతో అనుభవజ్ఞులు, నిస్వార్థ ప్రజాసేవకులు ఏర్పరచిన మంచి గమ్యము నీతి. సంఘపరమగు నియమములతో పాటు మన పురాతన 'స్మృతులు' వెలువరించిన ధర్మప్రతిపాదకములగు సూత్రములన్నియు కూడ నీతి సూత్రములు. ధర్మాధర్మములను అల్పబుద్ధులకు కూడ సులభముగా తెలియునట్లు బోధించుటకై ఆవిర్భవించినవే స్మృతులు'[38] అవి 'గురుః అనుగన్తవ్యః'[39] గురులయెడ వినయముగ ఉండుట వంటి నీతివచనములను బోధించును. అవి ధర్మమును వివరించు హితోపదేశములు. ధర్మబోధ నీతి బోధ హితబోధ అనునవి పరస్పర సంబంధములు. అవియే నీతినియమములు

జానపదుల సామెతలందు నీతినియమములను వివరించు అంశములు గలవు.

'ఏడ్చేడ్చి ఎడమ కన్ను పాయె, 'కుడ్చి కుడ్చి కుడి కన్ను' పాయె' ఈ సామెత అసూయవలన జరుగు అనర్థమును వివరించుచున్నది మానవులకు అసూయ అనునది ప్రగతికి ప్రతిబంధకము అను నీతి ఇందు కలదు.

'కొంచెపు దాని కొంగు దాకితే మంచోని మానం పోతది' కొంచెపు బుద్ధులు (చిన్న బుద్ధులు) కలవారితో, మంచివారు చెలిమి చేసినచో, పరువు పోవునను హితవు, నీతి ఈ సామెతన కలదు.

'కుక్కను తీస్కపోయి పల్లకిల కూచుండపెడ్తె కుచ్చులు కొర్కిందట' అర్హత, యోగ్యత కలిగి వస్తువ విలువను గుర్తించు మనస్తత్వము కలవారికే ఉన్నత స్థానమిచ్చి గౌరవించుట శోభించుననియు కాని అసమర్థులు, అవినీతి పరులకు అగ్రస్థానము విలువ తెలియదను నీతిని ఈ సామెతన స్పష్టము ఇది 'కనకపు సింహాసనమున' అను సుమతి శతక పద్యమును పోలియున్నది.

'పిల్లలందు గవి చీకటంటుతది' మంచికన్న చెడు త్వరగా అబ్బునదియు కావున మానవులు శ్రమించి మంచినే స్వీకరించ వలయునను నీతిని ఈ సామెత వివరించినది.

'తొందర పడ్తె బొందల పడ్తరు' జీవితమున ఏ విషయమునందును త్వరపడి నిర్ణయములు తీసికొనరాదనియు. నిదానముగ యోచించి ముందుకు సాగిన కష్టములు రావనియు ఈ సామెతన స్పష్టము. ఇది భారవి మహాకవి 'విమృశ్యకారిణా' అను శ్లోకమును తలపింపచేయుచున్నది.

'నియతెంతో బర్కతంత' 'నీయత్' అను ఉర్దూ పదమునకు కట్టుబడుట అని అర్థము. 'బర్కత్' అనగా లాభమని అర్థము. మంచికి కట్టుబడి జీవించుట వలన లాభము చేకూరునని ఈ సామెత వివరించుచున్నది.

'చుట్టు దిరిగి సుఖంగ బోవాలె' మనిషి అలస్యమయినను అడ్డదారిన గాక దొడ్డ దారిన పయనించవలయునను నీతి జానపదులు వివరించిరి.

'ఏలాంగనిదే ఎన్నదీయరాదు' ఈ సామెత యందు మంచిని సాధించు టలో శ్రమ తప్పదనియు, శ్రమ పడినచో మంచి ఫలితము పొందవచ్చునను నీతి వెలువరింపబడినది. శ్రమలోనే సుఖము కలదని పరోక్షముగ వివరింప బడినవి.

## మృత్యువు :

మానవ జీవితమందు చివరి ఘట్టము మృత్యువు. పుట్టిన ప్రతి జీవికి తప్పనిది. అది మానవజీవితమునకు పరిమితి విధించుచున్నది. మృత్యువు అనగా మృతి కలిగించునది. అనగా మరణము తెచ్చునది. మరణమనగా, మానవుని 'ఆత్మ' అతనిని వదిలి పంచభూతములందు కలియుట. అని నిర్వచనము కలదు.

'మానవుడు తన జీర్ణమగు శరీరమును వదిలి నూతనమగు దేహాంతర మును పొందుటయే'40 మృత్యువని చెప్పబడినది. 'మనిషి మరో లోకము నకు వెళ్ళుటయే మృత్యువు'41 అని కొందరి నమ్మకము ఈ మృత్యువును వివరించు సామెతలు జానపదుల యందు గలవు.

'వాన రాకడ పానం పోకడ తెల్వదు' ఈ సామెత యందు మానవు లకు మృత్యువు ఎప్పుడు సమీపించునో తెలుసుకొను శక్తి లేదనియు, దైవ నిర్ణయము వలననే అది జరిగిపోవునని వివరింపబడినది.

'పది మందిలో చావు పెండ్లితో సమానం' మానవులు తమ మృతి పిదప దహనాది సంస్కారములు వైభవముగా జరగవలయునని కోరుకొనుట గలదు. అది వారికి ఎంతో మంది బంధువర్గము ఉన్ననే సాధ్యపడుననియు వారి మధ్య చావు, పెండ్లితో సమానమనియు ఈ సామెత వివరణ.

'చచ్చినోని ముడ్డి కింద్రైతేంది మీద్రైతేంది' అందు తిరిగి రాని వారి గురించి, న్యాయాన్యాయ పరిశీలన ముఖ్యముగాదనియు వివరించుచున్నది. మరణము ఆసన్నమైన వ్యక్తి మంచ మందు మృతి నొందరాదని, అతనిని నేలపై పరుండ పెట్టుదురు కొందరు దీనిని గురించి వ్యర్థ వాదోపవాదములు చేయుటచే ఈ సామెత పుట్టి యుండవచ్చునని తోచుచున్నది.

'చచ్చినోని కండ్లు చారెడంత' ఈ సామెత మృతి నొందిన వారి గురించి గొప్పగా చెప్పు విషయమును వ్యంగ్యముగా వివరించుచున్నది. గతించిన వన్నియు గొప్పగా అనిపించునని కాని దాని వలన లాభము లేదని స్పష్టము చేయును. ఈ సామెతలన్నియు 'చావు'ను ఉపమానముగా స్వీకరించి చెప్పబడినవి.

ఈ సాంఘిక జీవనము అను ప్రకరణమున పుట్టుక, విద్య, వివాహము సంతానము, స్త్రీ పురుష ప్రతిపత్తి, కుల వ్యవస్థ, వృత్తులు, ధనిక నిర్ధనిక భేదములు, మతము, ఆచారములు, పండుగలు, శకునములు, నమ్మకములు, నీతి నియమములు, మృత్యువు అను మానవ సంఘమునకు సంబంధించిన ముఖ్యములు ప్రదర్శింపబడిన సామెతల స్థితిని వివరించితిని.

# శాస్త్ర విజ్ఞానము

జానపద సాహిత్యము ఎంత అమాయకముగా కన్పించినను, అందు ఎన్నియో శాస్త్రాలకు సంబంధించిన విశ్వాసములు, అభిప్రాయములు వ్యక్తమగుచునే యున్నవి. జానపదులు తమ పరిధిలో తాము, తమ అనుభవమునుండి గ్రహించిన జీవితవాస్తవముల నుండి పొందిన ఎన్నియో శాస్త్రసంబంధమగు అభిప్రాయములను వివరించియున్నారు. వీరికి శాస్త్ర దృక్పథము 'అనుభవమను' సంశోధనాలయము నుండి లభించినది వీరు తమ సామెతలందు వ్యవసాయ, వైద్య, శకున, జ్యోతిష్య, అర్థిక, రాజకీయ శాస్త్రముల గురించి ఎన్నియో అభిప్రాయములను, విశ్వాసములను వివరించిరి, నేడు నాగరిక సమాజమున ప్రతి శాస్త్రమునందు అద్భుత ప్రయోగ ఫలితములు

సాధించుట వలన జానపదుల శాస్త్ర అభిప్రాయములు మనము అంగీకరించక పోయినను వారి పరిధిలో వారు నమ్మిన సిద్ధాంతముల వెనుక గల విశిష్టతను గమనించ వలయును.

మానవ జీవితమున శాస్త్రములకు చాలా ప్రాముఖ్యము గలదు. శాస్త్ర మనగా పరిశీలించి పరిశోధించి నిర్ణయించిన సూత్రనియమావళి అని చెప్ప వచ్చును. జానపదులు సామెతను కూడా 'శాస్త్రము' అని వ్యవహరించుటగలదు. దీని వలన సామెతలకు వారు శాస్త్ర మంతటి విలువ ఇచ్చినారని తెలియును. జానపదుల జీవిత మందలి శాస్త్రములు వారి ఆలోచనా విధానమును, వారి విశ్వాసముల విలువను, వ్యక్తీకరించునని చెప్పక తప్పదు. జానపదుల సామెతల యందు గల శాస్త్ర విషయములను వరుసగా 1) వ్యవసాయ శాస్త్రము 2) వైద్య శాస్త్రము 3) శకున, జ్యోతిష్యశాస్త్రము 4) ఆర్థిక శాస్త్రము 5) రాజకీయ శాస్త్రము అను విధములుగ విభజించుకొనవచ్చును.

## వ్యవసాయ శాస్త్రము :

భారతదేశము వ్యవసాయ ప్రధానమగు దేశము. అందు ఆంధ్రదేశము అన్నపూర్ణ తెలంగాణము పసిడి పంటలు పండించు మాగాణము, జానపదుల జీవితమున వ్యవసాయమునకు గల ప్రాధాన్యము అతివిశిష్టమైనది. అది వారి ప్రధాన జీవనోపాధి ఈ వ్యవసాయ శాస్త్ర సంబంధమగు అనుభవములు, ఆధునిక విజ్ఞాన విశేషాలతో పరిశోధించి, పరిష్కరించిన విషయములతో పోటీ పడక పోవచ్చును. కాని జానపదులు 'వ్యవసాయము' పైన ఏర్పరచుకొనిన అభిప్రాయములు, విశ్వాసములు ఆధునిక వ్యవసాయ శాస్త్రవేత్తలను కూడ మెప్పించి వారి నూతన ప్రయోగములకు పునాదులైనవి. జానపదులు పంటలకు, పశువులకు ఇచ్చిన విలువ అనన్యసామాన్యమైనది వానిని గురించిన ఆలోచన వారికి అత్యంత ప్రీతిపాత్రము. వ్యవసాయమును గురించిన కొన్ని పండుగలు (ఏరువాక) (కొత్త) చేసుకొనుట వారికి వ్యవసాయముపై గల మక్కువను వివరించుచున్నది. ఆయేటి, పునాస, మండె, కైకిలి, కలుపు మొదలగు, వారి వ్యవసాయ సంబంధమగు, పలుకుబడి, భాష యందు కూడ కొత్త అందాలను సృష్టించినది.

వీరి శాస్త్ర సంబంధమగు సామెతలలో అగుపించుకొన్ని మూఢ నమ్మకములు వారి అమాయకత్వమునకు చిహ్నములు. 'మంగళవారం మందేయ కూడదు' అది వ్యవసాయ సంబంధమగు ఒక విశ్వాసము. తొలిసారిగా విత్తనము గురించి, వడ్లు నానబోసి వాటిని మండె కట్టే రోజు మంగళవారం కాకూడదని ఒక విశ్వాసము. దీనిని అంతగా ఈ రోజులలో పాటించుట లేదు.

వ్యవసాయము చేయు వారికి తను స్వంత పొలమున పంట ఎంత పండినను ఆనందము కలిగించును. స్వంత భూమి కన్న బిడ్డతో సమానమని వారి అభిప్రాయము ఈ 'తర్రైన బుర్రైనా తనచేను పండాలి కుంటైనా గూనైనా తన కడుపు పంటాలి' అని వివరించినారు.

భూమిని సక్రమముగా దున్ని పంట కమువుగా మార్చుకొనుట రైతు పై ఆధారపడినది. దీనిని వీరు 'చాలుపై చాలుదుంటే చచ్చునేల కూడపండుద్ది' అని అనుభవముతో చెప్పినారు.

వ్యవసాయమును అనువగు ఋతువున అవసరములను గమనించి చేయవలయునని అదను తప్పిన పిదప చింతించి లాభము లేదని ఈ 'అయేది[1] ముందు అటు-ఇటు తిరిగి కార్తిక మాసం కంటికి నీరు తెచ్చుకున్నట్లు' అను సామెతను వివరించినారు.

వ్యవసాయము లాభసాటిగా ఉండి పంటలు పుష్కలముగా పండవలయుననిన అనుకూల పరిస్థితులు కావలయును. వానిని గురించి ఈ 'ముందు ఘుందు ఊరి బందు'[2] అని విత్తనము 'ముందు'గా కార్తినమసరించి వేయవలయునని తరువాత 'మందు' (రసాయనిక ఎరువు) కావలయుననియు, ఊరికి (బందు) దగ్గరగా ఉండవలయునని అభిప్రాయమును వెలువరించినారు.

వ్యవసాయమును కార్తులననుసరించి చేయుదురు. కొన్ని కార్తులు పంట దిగుబడి అధికముగా ఉండుటకు తోడ్పడునని ఈ 'మాఘలో మానెడల్కిందొకటి పుబ్బలో పుట్టెడల్కిందొకటి' అను సామెత వివరించుచున్నది. ఇందు మాఘ

1 తరి (Season)

2 బాజు, ప్రక్కన

కార్తియందు కొద్ది విత్తనము వేసినను అధికదిగుబడి వచ్చునని, పుబ్బ (ఉత్తర ఫల్గుణి) కార్తి యందు పుట్టెడు విత్తమునలు చల్లినను అంతే ప్రయోజనమని వివరించిరి.

వ్యవసాయమునకు ఎరువులు ఎంతో అవసరము. రసాయనిక ఎరువులు వాడుకలోనికి రాకముందు పశువుల ఎరువును వాడుచుండెడివారు. ఎరువులు పంటలకు ఇచ్చు బలమును గురించి అనుభవముతో జానపదులు ఈ 'గొర్రెల పంట ఏడాది ఆవుల పెంట ఆరేండ్లు' అను సామెతన వివరించినారు.

సకాలమున కురియు వర్షము వ్యవసాయమునకు ఎంతో అవసరము. పంటకు అనుకూలమగు (స్వాతి) కార్తి యందు వర్షము కురిసిన పంటలు బాగా పండునను నమ్మకము జానపదులకు గలదు. దీనిని ఈ 'సాతిలో వాన గొత్తె సవాలచ్చ మంది బతుకుతరు' అను సామెత యందు వివరించిరి.

వ్యవసాయమున భూమిని దున్నునపుడు, మొదట దున్నుచు వెళ్ళిన వాడు మెలకువతో ఉండవలయుననియు అతనిని అనుసరించి వెనకవచ్చు 'నాగళ్ళ' నడక అధారపడి యుండునని ఈ 'ముందు నాగలెట్లబోతె ఎనుక నాగలట్నే బోతది' అను సామెతన స్పష్టము.

వేసవికాలమందు వర్షములు లేకయు, ఉన్నము అధికముగా రాళ్ళ వర్షములు కురియుట వలనను పంటలకు నష్టము వాటిల్లును. ఈ వేసవి పంట ఇంటికి చేరు వరకు నమ్మకము లేదు. కావుననే 'ఏ వంగిపంట ఏటిగట్టు బిడ్డ' అను సామెత పుట్టినది.

వేసవి కాలమందు వర్షములు లేకయు, ఉన్నము అధికముగా రాళ్ళ వర్షములు కురియుట వలనను పంటలకు నష్టము వాటిల్లును. ఈ వేసవి పంట ఇంటికి చేరు వరకు నమ్మకము లేదు. కావుననే 'ఏ వంగిపంట ఏటిగట్టు బిడ్డ' అను సామెత పుట్టినది.

పశువులు :

జానపదులకు పశువుల యొక్క లక్షణములు వానికి వచ్చు రోగములకు తగిన చికిత్సలు తెలియును. వీరు పశువులను కొనునపుడు జాగ్రత్తగా ఆలోచింతురు అందువలననే ఎద్దు కొనునపుడు 'ఏడు కురుచలు చూసి ఎద్దును కొనాలి' అని వివరించిరి. పశువులను కొనునపుడు సుడులు, మచ్చలు మొదలగునవి వ్యవసాయదారులు జాగ్రత్తగా పరిశీలింతురు. వ్యవసాయమునకు ఎద్దులు ఎంతో ముఖ్యము. వీని ప్రాముఖ్యమును ఈ 'ఎద్దులేని సేద్యం, చద్దిలేని పయనం' అని సామెతన వివరించిరి.

పశువులను కొనుటతో పాటు వానికి అవసరమగు తక్కువ ధర గల వస్తువులు కూడ కొందరు కొనరనియు వారి అశ్రద్ధను హేళనగా ఈ 'బర్రెంగొని తలుక్కు ఐయుపడుటెందుకు' అను సామెత పుట్టినది.

వ్యవసాయ పనులు :

వడ్ల యందలి 'పొల్లు' పోవుటకు వానిని, ఎత్తు ప్రదేశము నుండి పోయుదురు. దీనిని తూర్పార పట్టుట,ఎగబోయుట అని అందురు. ఈ పనిని గాలి వీచునపుడే చేయవలయుననియు, మన పని గురించి గాలి రాదని ఈ 'గాలొచ్చినపుడే తూర్పారబట్టాలె' అను సామెతన వివరించిరి. పంటలు ముగిసిన పిదప కల్లము పెట్టిన చోట కొందరు బీదకూలీలు భూమిలో ఇరుక్కు పోయిన వడ్లను చుట్టు ప్రక్కల చెదిరిన వడ్లను దగ్గరికి చేసికొందురు. దీనిని 'లేకి' అందురు. ఇది గాని మరియు వీరికిచ్చు మిగతా పనుల కూలి గాని వీరికి సరిపోదనియు, అయినను తప్పదనియు వ్యవసాయ కూలీల దీనపరిస్థితిని "లేకి చేటకురాదు కూలి కుండకు రాదు" అను సామెతనవివరించిరి.

వ్యవసాయ సంబంధమగు సామెతలెన్నియో జానపదుల యందు కలవు.ఇవివారికి వ్యవసాయ శాస్త్ర విషయములపై గల శ్రద్ధను నమ్మకమును వివరించును.

## వైద్యశాస్త్రము:

మానవుని పుట్టుకనుండి గిట్టుట వరకుగల జీవితము నందు వైద్యమునకు గల ప్రాధాన్యము విశిష్టమైనది. జానపదులు అనుసరించు వైద్యావిధానములు ఎక్కువగా వారి అనుభవము నుండి గ్రహించినవే ఔషధములు వారి పరిసరమందు గల ప్రకృతి నుండి లభించినవే వారి చికిత్సయందు ప్రధాన విషయములు కొన్ని నియమములను పాటించుట మందు స్వీకరించునపుడు దానికి విరుగుడు చేయు పదార్థములను వాడకూడదని ఆయుర్వేద వైద్య విధానమునందలి నమ్మకము. దానిని వీరు ఈ "మందుకు పత్యం మాటకు పత్యం" అను సామెత లో స్పష్టము చేసి పత్యం [పథ్యం] అనగా తినకూడని వస్తువులను తినరాదని అర్థము మనిషి మాటకు పత్యమెంత ప్రధానమో, మందుకు పత్యము కూడ అంత ప్రధానమని ఈ సామెతన వివరించినారు.

మనము ఆహారముగా స్వీకరించు పదార్థములలో కొన్ని ఆరోగ్యమునకు అనారోగ్యమునకు కూడ కారణములగుచున్నవి వీనిని గమనించి స్వీకరించవలయును. ఉల్లి శరీరమునకు మంచిచేయునని చెప్పుదురు అది చేయుమేలును గురించి ఈ "ఉల్లి తల్లినుంటిది" అను సామెతన స్పష్టము

మనిషికి జబ్బు వచ్చిన వెంటనే చికిత్స చేయించుకోవలయునని దానిని దాచిన, ప్రాణాపాయస్థితి కూడ కలుగునని ఉపమానముతో ఈ "ధనమొస్తె దాచుకోవాలె రోగమొస్తె అమ్ముకోవాలి" అను సామెతన వివరించినది కొందరు వ్యక్తులు తెలిసి తెలియని వైద్యము చేసుకొని ఆపదలు తెచ్చుకొందురు. వారిని గురించి హేళనగా "కొండెవాళ్ళకు మందువేస్తె ఉన్నవాళ్ళెక్క ఊసిబోయిందట" సామెత విమర్శించుచున్నది రోగికి వాడు ఔషధములు చేదుగా ఉండును. ముఖ్యముగా ఆయుర్వేదమున చెట్ల మూలికలు ఔషదము అగుటవలన చేదుతనము ఎక్కువ వాటి పనితనము ఎక్కువే కావున మందులు చేదుగ ఉండుట సహజమనియు తీయని మందులు కమ్మని పిత్తులు ఉండవని ఈ 'తియ్యటి మందులు కమ్మటి పిత్తులు' అను సామెతన వివరించినారు.

వైద్యము చేయువారి హస్తవాసి మంచిది కావలయునని జానపదులకు విశ్వాసము కలదు. మంచి హస్తము కానిచో వారి చేతి మాత్ర చేయు హానిని ఈ 'నీ చేతి మాత్ర వైకుంఠ యాత్ర' అను సామెతన వివరించిరి.

## శకున జ్యోతిష్య శాస్త్రము :

జానపదులకు శకున,జ్యోతిష్య విషయములపైన అధికమైన నమ్మకము కలదు. ప్రయాణములకు, పనులు ప్రారంభించుటకును, శుభకార్యములకును వీరు శుభాశుభ శకునములను గమనించుదురు. వీనిని గురించి జానపదులు తమ సామెతల యందు వివరించిరి. పెండ్లి వంటి శుభకార్యములకుగాని లేదా మరియొక కార్యార్థమైగాని వెళ్ళునపుడు అపశకునములు జరిగిన మంచిది కాదను నమ్మకము కలదు. పిల్లి ఎదురు వచ్చుటయు, పిల్లి అడ్డముగా వెళ్ళుటయు, అపశకునము అయినను, అది వెళ్ళు-దిశననుసరించి శుభాశుభములు కలవని తెలియుచున్నది. దీనిని ఈ 'ఎడమ నుంచి కుడికి పోతే పిల్లి, కుడి నుంచి ఎడమకైతే తల్లి' అను సామెతన వివరించిరి.

స్త్రీలు కొన్ని తిథుల ననుసరించి ప్రయాణము చేయుదురు. అష్టమి పక్షములు ప్రయాణమునకు మంచివి కావను విశ్వాసము కలదు. అందు శని కలిసి వచ్చిన అసలు ప్రయాణము చేయరు. దీనిని ఈ 'అష్టమ శని కష్టాలు పెడతాడు' అను సామెతన వివరించినారు.

వీరికి విధిపైన, జాతకముపైన గట్టి విశ్వాసము కలదు. మానవుడు చేయు పనులను విధి అతని నుదుట వ్రాయుననియు, దానిననుసరించి అతని జీవిత విధానము నిర్ణయింపబడి ఉంటుందనియు ఈ 'అందలమెక్కుదామంటె నొసల కట్టెలు మోద్దామందట' అను సామెతన స్పష్టము. అందు మనము కోరిన కోరికలన్నియు జరగవనియు అందలమెక్కవలయునని ఆశించిన వారి నుదుట కట్టెలు కొట్టి జీవింపవలయునని వ్రాయబడి యుండ వచ్చుననియు విధి విధానము విచిత్రమనియు వివరించిరి.

అదృష్టమున్నదుతదృష్టము అనువారిననుసరించి మంచి చెడు ఫలితములు కలవనియు, ఏ పనికైనను అదృష్టము ప్రధానమని ఈ 'చదువ పోయినా కూడ పోయినా అదృష్టం కావాలి' సామెతన వివరించిరి.

ఆదే విధముగ దేవుడు దయ తలచిన మనిషి జీవిత మందలి చెడు దశ ఉత్తమ దశగా మారు అవకాశము కలదు. ఈ విషయము 'దేవుడు లగాయించె దెనకొలాయించె' అను సామెత స్పష్టపరచినది.

ఆర్థిక శాస్త్రము :

మానవ మనుగడకు ప్రధానావసరము డబ్బు అని చెప్పక తప్పదు. జీవితసరళిని నిర్దేశించునది ఆర్థిక వ్యవస్థ అని ఆర్థిక శాస్త్రవేత్తల అభిప్రాయము. మనిషి ఆర్థిక జీవనము మెరుగుగా ఉన్ననే అతని జీవితమున సుఖ సంతోషములు వెలయును.

జానపదుల అభిప్రాయమున మానవులకు డబ్బు అవసరమైనను, అత్యవసరము మాత్రము కాదు. వారు దాని కొరకు నీతి నియమములను అమ్ముట కంగీకరించరు. దానిని ఈ 'మూటపోతె వాయె గాని మాటపోవద్దు' అను సామెత స్పష్టము చేయుచున్నది. ఆదే విధముగ తమ సంపాదన ననుసరించి పొదుపుతో జీవించవలయునని జీవితము అప్పుడే సుఖవంతము అగునని 'గొంగడున్నంత కాళ్ళు చాపు కోవాలె' అను సామెత ద్వారా వ్యక్తీకరించినారు.

తమ స్థితిని మించి అనవసరపు ఆడంబర ప్రదర్శనము గావించు కొందరిని ఈ 'ఖానాకు గతిలేదు లంజకు ఖులావ్' సామెతన వ్యంగ్యముగా నిరసించినారు.

అప్పులు చేసి హాయిగా తినికూర్చున్నచో అవి తీర్చు సమయమున ఏడుపే మిగులుతుందను సత్యమును 'బొక్కకొర్కంగ భోగం లెక్కపెట్టంగ దుఃఖం' అను సామెతన వ్యంగ్యముగా హెచ్చరించినారు.

సంపాదన ననుసరించి ఖర్చులు కూడ ఉండునని సంపాదనతో పాటు హోదా, హోదాతో పాటు ఖర్చులు పెరుగునని 'ఎంతచెట్టు కంత గాలి' అని వివరించిరి.

మరి కొందరు ఎల్లప్పుడు ఏదో పనిలో నిమగ్నమై ఎంతో సంపాదించు చటుల అగుపింతురు. కాని వారి సంపాదన తక్కువనియు ఈ 'గడియ పుర్సతులేదు గవ్వరాకడ లేదు' అను సామెతన స్పష్టము చేయబడినది.

కొందరి సంపాదన వారి జీవితావసరములకు సరిపోదు. ముఖ్యముగా పేద వర్గానీకానికి ఈ సమస్య తప్పలేదని వారి సంపాదన గురించి ఈ 'పొద్దస్తి పొట్టకు మూపస్టి బట్టకు' అను సామెతన వివరించిరి.

'మరి కొందరు ఎంత సంపాదించినను వారి భార్యల విలాసములకు ఆడంబరపు ఖర్చులకు సరిపోదని ఈ 'అయ్యగారి సంపాదన అమ్మగారి పసుపుకుంకుమ' అను సామెతన వివరించినారు.

కొందరు ఎన్నో వేషములు ధరించి ప్రజలను వినోదపరచి డబ్బును సంపాదింతురు. వారి వృత్తిని 'వినమేస్తె గావమొస్తది' అని వివరించిరి.

మరి కొందరు అప్పులు చేసి జీవింతురు. కాని దాని వలన అతని జీవితము సప్పులపాలు కాగలదు. ఈ 'అప్పు ఆదా కాదు వాపు బలుపు కాదు' అను సామెతన అప్పు వలన సంపాదించినది శాశ్వతముగ ఉండదనియు, అది ఉండునని భ్రమ పడిన అది వాపును చూచి బలుపనుకొనుట వంటిదని చక్కని ఉపమానముతో వివరించినారు.అందుచేతనే 'అడుక్కు తినవచ్చుగాని అప్పుచేసి తినరాదు' అను సామెత వెలసినది.

కొందరికి హఠాత్తుగా కష్టము చేయకనే పదుమంత్రమున డబ్బు వచ్చును. దానితో వారియొక్క ప్రవర్తన మారిపోయి కన్నూమిన్నూ గానక ప్రవర్తింతురు. అది అతని పతనమునకు దారి తీయునని ఈ 'పదు మంత్రిన సిరివస్తె పదుమిరగ పడ్తడు' అని వివరించిరి.

ఈ విధముగా సంపాదన కొరకు కొందరు పడు శ్రమ కొందరి ఆర్థిక స్థితి, మరి కొందరి అప్పుల బాధ, కొందరి పదమంత్రపు సిరి మొదలగు విషయములన్నియు ఈ ఆర్థిక సంబంధములగు సామెతల యందు వివరించినారు.

## రాజకీయ శాస్త్రము :

రాచరిక వ్యవస్థ యందలి రాజనీతి సిద్ధాంతము నుండి పుట్టినది రాజకీయపదము. కాని నేడి కాలమున పరిపాలనా సంబంధమగు అంశముగా భావించుచున్నారు. ప్రజలే పాలకులగు ఈ వ్యవస్థన మనిషికి రాజకీయముల గల సంబంధము విడదీయరానిదిగా మారిపోవుచున్నది.

రాజకీయములు క్రమముగా జానపద జీవితమును కూడ ప్రభావితము గావించినవని వారి సామెతలందలి రాజకీయాంశములను పరిశీలించిన స్పష్టమగును. నేడి కాలమున రాజకీయములకు విద్యా, వివేకము, నీతి, నిజాయితీ అనునవి కాక కేవలము డబ్బు, హోదా, పలుకుబడి అవినీతి అనునవి అర్హతలుగా మారినవి. చివరకు రాజకీయు మన 'కపటపు ఎత్తుగడ' అను వ్యంగ్యార్థమున వాడబడుచున్నది.

గ్రామ సీమ అందలి రాజకీయములు కేవలము గ్రామ పెద్దల 'గారడీలు' అని చెప్పవచ్చును. చిల్లరదేవుళ్ళగు వీరి చేతలు, జానపదులు తమ సామెత అందు చక్కగా వివరించిరి.

కొందరు గ్రామ పెద్దలు తమ పదవి, పలుకుబడి నిలుపుకొనుటకు ఎన్నియో ఎత్తులు వేయుదురు. వారిని గురించి 'చాట్ల తౌడు పెట్టి కుక్కలకు యాట్లాటపెట్టి' అను సామెతన వివరించిరి. ఇది ఇరు పక్షాల మధ్య తగువు పెట్టి ఆ అమాయకులను తమ స్వార్థానికి బలిచేయు వారందరికి కూడా వర్తించును. మరికొందరు అమాయకుల జీవితమును నాశనము చేయుదురు. వారిని గురించి ఈ 'ఆవులావులు కొట్లాడి లాగెల కాళ్ళిర గ్గొట్టె' అని వివరించినారు.

మరి కొందరు పెద్దలు చాటుగా కొంపలకు కొరివిపెట్టి ఏమీ తెలియని అమాయకుల వలె నటింతురు. లేదా ఒకరి విషయమును మరి ఒకరికి అందించి, తగువులు సృష్టించి పక్కకు తప్పుకొందురు. వారిని గురించి

'కొంది మీటుదు గోడ కెక్కుడు' అను సామెతను స్పష్టపరిచారు. అందు అటు వంటి వారిని శీలుతో పోల్చినారు. శీలు కుట్టిన తరువాత ఏమి ఎరగనట్టు గోడ పైకి పోతుంది.

మరి కొందరు తమనేరాలను ఇతరులపై మోపి వారిని శిక్షకు గురిచేసి తాము తప్పుకొందురు. వారిని గురించి ఈ 'కిందిమీదేసుడు మందిమీద్దొబ్బెడు' అని వివరించిరి.

ఈ అనుభవము రాజకీయ విషయములందు, కేసులందు, సామాన్యముగా అగుపించును. ఇది రాజకీయ నాయకులకు వెన్నతో పెట్టిన విద్య. మరికొందరు గ్రామ పెద్దలు అధికార దర్పము, స్వార్థపరత్వము తమ సైజంగా కలిగి ఉందురు. ఒక దొరగారి అన్యాయ ప్రవర్తన ఈ 1 'సాలుచెప్పే దొరాంటె, దుడ్డెబర్రెనీనాదన్నాడు' అను సామెతన వివరించిరి.

మరో పటేలు తన వద్దకు ఫిర్యాదుకు వచ్చిన వారినే శిక్షించినాడని ఈ 'ఇమర్శ లేని పటేలు ఈనంత పలగ్గొట్టిండు' అను సామెతన వివరించిరి.

ఈ వ్రికరణముల, జానపదులు తమ సామెతలందు వెలువరించిన శాస్త్ర విషయముల గురించి వివరించితిని. వీనిలో వారికి శాస్త్ర విషయములపై గల ప్రగాఢ విశ్వాసము స్పష్టమగుచున్నది వీరు తమ సామెతలలో 'వ్యవసాయ' శాస్త్రమునకు అధిక ప్రాధాన్య మిచ్చి నిజమగు జానపదులు అనిపించు కొనిరి. తర్వాత వైద్య, జ్యోతిష్యశకునాది శాస్త్రములయందు తమ విశ్వాసములను ప్రకటించిరి. మరికొన్ని సామెతల పరిశీలనమున వారి ఆర్థిక స్థితిగతులను, రాజకీయ అవగాహన స్పష్టము చేసిరి. వీటినన్నింటిని సంక్షిప్తముగా వివరించితిని.

---

1 సాలు = న్యాయము

# కథలు

ప్రాచీన కాలము నుండియు భారతదేశము కథలకు, గాథలకు ప్రసిద్ధి చెల్లు ఎన్నియో గాథలు తెలుగు సామెతల పుట్టుకకు కారణములైనవి. ఇతిహాసములు, పురాణములు, జానపదులు స్వయముగా చదవకున్నను వారు ఈ గాథలన్నియు విజ్ఞుల వలన తెలిసికొని యుండుట వలన, తమ జీవితానుభవమున ఈ గాథలందలి సంఘటనములను సమన్వయించుకొనుచునే ఉందురు. ఈ కారణమున వారు, తమ సంభాషణమున తరచుగా ప్రయోగించు సామెతలను సైతము కథలు, పౌరాణిక గాథల ననుసరించి నిర్మించుకొనిరి. అందువలననే, సామెతల పుట్టుకకు గల ప్రధాన కారణములలో 'కథలు-గాథలు' కూడా పేర్కొనబడినవి.

భారతీయులకు పవిత్రములగు భారత రామాయణాది గాథా సంబంధములగు విషయములతో ఎన్నియో సామెతలు, భారతీయ భాషలన్నింటి యందు అగుపించుచున్నవి. 'పంచతంత్రము' వంటి కథా సాహిత్యము కూడా ఎన్నియో సామెతలను సృష్టించినది.

గాథలకు సామెతలకు సన్నిహిత సంబంధము కలదు. కన్నడమున సామెతను 'గాదె' అందురు. గాదె- గాథా శబ్దభవము అగుట ఈ విషయమును నిరూపించుచున్నది. హిందీ యందు సామెతను 'కహావత్' అందురు. ఈ మాట 'కథావ్రత్' అను శబ్దము వలన పుట్టినది. ఈ విషయము సామెతలకు, కథలతో గల సంబంధమును నిరూపించుచున్నది.

సామెతల యందు 'చూచిరమ్మంటె కాల్చివచ్చిండు' అను విధముగ పౌరాణిక గాథా సంఘటనము మాత్రము వివరించబడును, కాని కథలను వివరించు సామెతలందు 'అందని ద్రాక్ష పుల్లన' వలె పూర్తి కథా చిత్రణము ఉండుట గమనింపవచ్చును. కొన్ని కథల యందు ముగింపుగా చెప్పబడిన నీతి వాక్యములు సామెతలుగా మారుచుండుట గలదు.

జానపదులు సామెతల యందు వివరించిన గాథలననుసరించి,వీనిని 1. భారత సంబంధములు 2. రామాయణ సంబంధములు 3 భాగవత సంబంధములు అనియు కథలు గల సామెతలను 4. కథా సంబంధములు అని వర్గీకరించి వివరింపవచ్చును.

భారత సంబంధములు :

'ఆడోళ్ళనోట మాట దాగదు' ఈ సామెత మహాభారత గాథ ననుసరించి పుట్టినదని తెలియుచున్నది. పాండవ మాత కుంతీదేవి 'కర్ణుడు' తనకు ప్రథమ పుత్రుడను విషయమును అతని మరణానంతరము లోకమునకు వెల్లడించును. ఈ విషయము ధర్మరాజాదులకు తెలియక కర్ణుని శత్రుపక్షమని భావించి అతనిని రణమున వధింతురు స్త్రీ యగు కుంతీదేవి రహస్యం దాచుటమే దీనికి కారణమనియు స్త్రీలు రహస్యములు దాచుటచేత అనర్థములు జరుగునని భావించి 'స్త్రీల నోట మాట దాగరాదని శపించెను' అని 1 'జానపదులు' వివరించిరి.

'కర్ణుని తల భారతం' కర్ణుని పాత్ర ప్రాముఖ్యతను 'విందే భారతం వినాలి తిండే గారెలు తినాలి' భారత కథ ప్రాముఖ్యమును వివరించు సామెతలు.

'నవ్వునాల్గు విధాల చేటు' ఈ సామెత భారత సంబంధమగు గాథను వివరించుచున్నది.

దుర్యోధనుడు 'మయసభ' వీక్షించు సమయమున అందలి చిత్ర విచిత్రములగు దృశ్యములకు మైమరచి సాగుచు ఉండగా ఒక చోట విచిత్రమగు కొలనును గాంచి కాని అది వాస్తవమునకు కొలను గాదని భ్రమించి అందు పడిపోవును. ఈ సమయమున అచ్చటి కేతెంచిన ద్రౌపది దుర్యోధనుని స్థితిని గాంచి పరిహాసముగావించును. దానితో అభిమానధనుడగు సుయోధనుడు కినుక చెంది. మాయాజూదము ఏర్పరచి అందు పాండవులను ఓడించి, ద్రౌపదిని నిండుకొలువున పరాభవించుటయు తరువాత భారత యుద్ధము జరిగి జనక్షయము జరుగుటకు దారి తీసినది. ఈ సంఘటనములకు ద్రౌపది నవ్వు కారణము.

1. ఈ గాథ వివరించినది శ్రీమతి, కె. శకుంతల (లింగం పల్లి గ్రామం.)

## రామాయణ సంబంధములు :

'నవ్వునాల్గు విధాల చేటు' ఈ సామెతను సమర్థించు రామాయణ గాథ కూడ కలదు. దీనిని జానపదులు 'లక్ష్మణ దేవర నవ్వు' అను చక్కని పౌరాణిక గేయమున వివరించిరి.

శ్రీ రామునితో పాటు పదునాలుగేళ్ళు వనవాసమున నిద్రరాని లక్ష్మణునకు శ్రీరామ పట్టాభిషేక సమయమున నిద్ర వచ్చినది. ఈ సమయము కాని సమయమున నిద్ర వచ్చుటచేత లక్ష్మణుడు నవ్వెను. కాని ఆ నిండు కొలువున ఉత్సవ సమయమున లక్ష్మణుడు తమకారణముగానవ్వెనని భావించి సభలోని వారందరూ కించపడిరట. జాలరి పడుచగు గంగను నెత్తిన మోయుచున్నందులకు తనను చూచి నవ్వెనని శివుడు, అన్నయగు రావణుని చంపించి రాజైనందుకు నవ్వెనని విభీషణుడు, ఆడరాని మాటలాడిన ఆడువారిని నమ్మరాదని నవ్వెనని జానకి రావణుని చెరనుండిన అర్థాంగిని స్వీకరించెనని రాముడు అవమానముగా ఎంచిరి. సభలోని ఈ పరిస్థితికి నవ్వుకారణము.

'చూచిరమ్మంటె కాల్చొచ్చిండు' ఈ సామెత రామాయణ గాథను వివరించునది.

'శ్రీరాముని ఆనతిన సీతాన్వేషణమునకు వెళ్ళిన హనుమంతుడు లంకా పట్టణ మందలి అశోకవనమున సీత చెర యందుండుట గమనించి సీత దరి చేరి రాముని క్షేమము వివరించును. సీత ఆనవాలుగా ఆమె నుండి చూడామణి గ్రహించి, తిరుగు ప్రయాణమున అశోకవనము ధ్వంసము చేయగా లంకాధిపతి కినుకచెంది హనుమ తోకకు నిప్పు పెట్టమని ఆజ్ఞాపించెను. అపుడు హనుమ నిప్పు పెట్టబడిన తన వాలముతో లంకానగరమును దహించి, సురక్షితముగా రాముని సమక్షమున చేరును.'

'చేసిన చేష్ట ఎవరు చూడరనుగని కోసిన ముక్కు నలుగురు చూస్తారు' ఈ సామెత రామాయణ గాథను వివరించినది.

'శ్రీరాముడు వనవాసమున ఉన్న సమయమున రావణుని చెల్లెలగు శూర్పణఖ అతనిని గాంచి, అతని అందమునకు మెచ్చి తనను చేకొనుమని అర్థింపగా, తాను వివాహితుడననియు, ఏకపత్నీవ్రతుడననియు చెప్పి, తన తమ్ముడగు లక్ష్మణుని వద్దకు పంపించును. శూర్పణఖ లక్ష్మణుని చేరి తన కోరిక వెల్లడించ నిష్ఠాగరిష్ఠుడగు, ముక్కోపియు అగు లక్ష్మణుడు ఆకాంత ముక్కు కోసి పంపించును. తనకు జరిగిన పరాభవమునకు ప్రతీకారము చేయ నెంచి, కొలువు తీర్చియున్న రావణుని వద్దకు వెళ్ళి తన స్థితిని వివరించును. రామలక్ష్మణులపై నిందలు కల్పించును. సభలోని వారందరును ఆమె కోసిన ముక్కును చూసి రామలక్ష్మణులకు తగిన పరాభవము చేయవలయునని రావణుని కోరుదురు'

'రామాయణమంతా విని రామునికి సీతేమది' అను సామెత ఒక్కో రామాయణమందు ఒక్కో విధమైన కథ విన్న జానపదుల అమాయకపు ప్రశ్న

'హనుమంతుని ముందా కుప్పిగంతులు' ఆంజనేయుల వారి శక్తి సామర్థ్యములు సమర్థించుచు పుట్టిన సామెత.

భాగవత సంబంధములు :

భారత, రామాయణముల వలనే భాగవతము కూడ తెలుగు వారికి పవిత్ర గ్రంథము భక్తి వైరాగ్యములకు ప్రతీకయగు ఈ గ్రంథము నందు హరిలీలలను వర్ణించు గాథలు కలవు. అందలి ఒక గాథను వివరించు సామెత.

'పొట్టోనికి పుట్టెడు బుద్ధులు' అది వామనుని తెలివి తేటలను సమర్థించుచు పుట్టిన సామెతగా తోచుచున్నది.

మహావిష్ణువు ప్రజలను బలిచక్రవర్తి బారి నుండి తప్పించుటకు వామనావతారము ధరించును. వామనుడు బ్రాహ్మణ వటువు వేషమున బలి చక్రవర్తి వద్దకు వెళ్ళి మూడడుగుల నేలను దానముగా అర్థించును. బలి అందుకు సిద్ధపడును. వామనుని బుద్ధి కుశలతను ముందే పసికట్టి రాక్షసామాత్యుడు, హితుడు, కులగురువగు శుక్రాచార్యుడు బలిని దానము ఇవ్వరాదని

కోరును. కాని మహాదాతయగు బలి శుక్రాచార్యుని మాట పాటించక దాన కార్యక్రమమును ప్రారంభించును. బలి, వామనునికి భూమి దానముగా ఇచ్చుచు, దాన జలము పోయువేళ ఆదానపాత్రలోనికి శుక్రాచార్యుడు ప్రవేశించి జలము రాకుండగా, కీటకరూపమున జలపాత్ర ద్వారమున అడ్డు పడును. ఈ సంగతి పుట్టెడు బుద్ధులు గల వామనుడు గ్రహించి చిన్నపుల్లతో జలధార వచ్చు ద్వారమున పొడుచును. అది కీటక రూపములో నున్న శుక్రాచార్యుని కంటికి తగిలి ఏకాక్షిగా మారును. తదుపరి దాన కార్యక్రమము నిర్విఘ్నముగా సాగిపోవును. మూడడుగుల నేల స్వీకరించిన వామనుడు యుక్తితో ఒక అడుగుతో భూమిని, రెండవ అడుగుతో ఆకాశమును ఆక్రమించెను. మూడవ అడుగును బలి శిరస్సున మోపి అతనిని పాతాళమునకు త్రొక్కివేయును ఇదంతయు పుట్టెడు బుద్ధుల, పొట్టివాని వలననే జరిగినది.

'ఎవరికి వారే యమునా తీరే' సుప్రసిద్ధ సామెత భాగవత గాథకు చెందినదే.

కథా సంబంధములు :

'అందని ద్రాక్షపుల్లన' ఈ సామెత యందు నక్కద్రాక్షపళ్ళ కథ వివరింపబడినది. ఈ కథ మనది కాదనియు ఇది ఆంగ్ల భాషకు చెందినదని తెలియుచున్నది. ఈ కథను అనుసరించిన సామెత భారతీయ భాషలకు, హిందీ, తమిళ, కన్నడ, మళయాళ, మరాఠీ భాషలందు కూడా అగుపించుచున్నది.

'ఒకనొక చోట ఒంటరిగా ఆకలితో తిరుగాడుచున్న నక్కకు, ఒక చోట ఒక ద్రాక్ష తోట కనిపించినది. అది అచటికి వెళ్ళి తీయనైన ఆ ద్రాక్ష పండ్లను తిన వలయునని ప్రయత్నించినది. కాని అవి ఎత్తున ఉండి అందక పోవుట వలన, అవి పుల్లగా నున్నవి అనుకొని వెళ్ళిపోయినది. అను కథ కలదు'. అందనివన్ని మంచివి కానివను, అభిప్రాయమును వివరించు సందర్భమున ఈ సామెత వాడుదురు.

'చదువుకున్నోని కన్న చాకలోడు నయం' ఈ సామెతన వివరించు కథ కనిపించుచున్నది.

'ఒక రోజు వేమన మహాకవి తన గ్రామము నుండి సమీపగ్రామ మునకు ఒక ఏరు దాటి పయనించ వలసి వచ్చినది. అపుడు ఆ ఏరు నిండుగా ప్రవహించుచు, సామాన్యులకు దాటరాని విధముగా నుండెను. వేమన తన మహిమ చేత, దేవుని ధ్యానించి ఆ ఏరులోని నీటిపైన మామూలుగా నడవ సాగెను. అవతలి గట్టున భార్యతో పాటు బట్టలుతుకున్న చాకలి ఆశ్చ ర్యముతో వేమనను గమనించు చుండెను. అంతలో ఏరును దాటుచున్న వేమన మునిగి పోసాగెను. కాని వేమన ఇదంతయు గమనించుట లేదు. అతని దృష్టి యంతయు దేవునిపై నుండి తప్పుకొని, చాకలి పక్కనే తడసిన బట్టలతో అవయవముల స్పష్ట పరచుచున్న చాకలి వనితపై గలదు. ఇది గమ నించి, చాకలి సమయస్ఫూర్తితో వేమన దృష్టిని మరలించుటకు అచటనే గల 'బానము' ఆమె పైన బోర్లించెను. అపుడు వేమన స్పృహలోనికి వచ్చి, తన తప్పును గ్రహించి, దేవుని ప్రార్థించి గట్టు చేరుకొనెను. తరువాత తన ప్రాణములను కాపాడిన చాకలి యుక్తిని ప్రశంసించెను. 42

'అకవికటపురాజు, అవివేకపు ప్రధాని' ఈ సామెత యందలి కథను జానపదులు ఈ విధముగా వివరించిరి.

'అనగనగా ఒక రాజ్యము గలదు. దానిని పరిపాలించు రాజు ఎప్పుడు అకట వికటపు పనులు చేయుచుండెడి వాడు. ఒక రోజు రాజు గారు తన పురోహితుని పిలిచి తనకు 'ఏకాదశి' కావలయునని దానిని కొని తీసుకి రమ్మని ఆజ్ఞాపించెను. అంతట ఆ తెలివిలేని పురోహితుడు ఎన్నిచోట్లనో తిరిగి తిరిగి చివరకి, ఒక మిఠాయి కొట్టు వద్దు ఏకాదశి గురించి అడుగగా ఆ తెలివి గల వేపారి, కొంత మిఠాయిని పొట్లమున కట్టి ఇచ్చి అదియే 'ఏకా దశి' అని పంపించెను. దానిని తీసుకొని వచ్చుచు మార్గ మధ్యమున 'ఏకాదశి' ఎటుల వుంటుందో అని పొట్లము విప్పి చూచి, దానిని భుజించును. పిదప వట్టి పొట్లమును రాజుగారి దగ్గరకు తెచ్చి 'ఏకాదశి' అని ఇచ్చును. రాజు ఆ పొట్లము విప్పిచూచి 'ఏకాదశి' ఏదని ప్రశ్నించును. అపుడు పురోహితుడు విన యముతో, జాగత్తగా దీనిని తీసుకొని వచ్చుచుండగా, అది మార్గమధ్యమున ఎగిరి పోయెనని ప్రత్యుత్తర మిచ్చును. మరి యొకసారి రాజుగారు రాజ్య భారమును తన మంత్రి మహాశయుడికి అప్పగించి, వేటకు వెడలును. రాజు వేటకు వెళ్ళిన కొద్ది రోజులకు అతని మహారాణి పాముకుట్టి మృతి నొందును. అపుడు అవివేకపు మంత్రిగారు, రాణి తలకు విషమెక్కుతుందని భయపడి,

ఆమె తలను కొట్టించి, ఉట్టి మీద భద్రపరచును. దాని వలన కొన్ని ఎలుకలు వచ్చి ఆ తలను భుజించుటచే ఎలుకలను పారద్రోలుటకు యోచించి. ఇల్లు తగుల పెట్టించును. ఇల్లు అంతయు కాలిపోవుచుండగా భీతి చెంది. దానిని ఆర్పివేయుటకు పెద్ద చెఱువు గండి పెట్టించును. అది వరదలుగా మారి ప్రవహించగా ఆ గండి అడ్డుకొనుటకు. పెద్ద వనము కొట్టి కట్ట వేయించును. ఈ విధముగా అవకతవక పనులు చేసి తన పనులు అన్నింటిని ఒక లేఖ యందు పొందుపరచి ఒక బంటు ద్వారా వేటకు వెళ్ళిన రాజుగారికి విన్నవించుకొనెను ఈ విషయములను తెలుసుకొని రాజు విచారించుటకు మారుగా చెఱువు గండి కొట్టించగా, అందలి చేపలు ఎటువెళ్ళినవి అని ప్రశ్నింప చెట్టు ఎక్కినవని. బంటు సమాధానము. 1

ఈ విధముగా ఈ కథ యందు రాజుగారి వింత ప్రవర్తన, మంత్రి పురోహితుడు, బంటు తెలివి తక్కువ తనము ప్రదర్శింపబడినవి. నేటికిని గ్రామ పెద్దలు వ్యర్థపనులను విమర్శించునపుడు ఈ సామెత ప్రయోగించుట కలదు. ఈ విధముగా ఎన్నియో కథలు మనము సామెతలందు గమనింప వచ్చును.

'కథ కంచికి, మన మింటికి' 'కథకు కాళ్ళు లేవు, ముంతకు చెవుల్లేవు' వంటి కథల గురించి అర్థవంతమైన సామెతలు కలవు.

ఇవిగాక సామెతలను సమర్థించుచునో, సామెతల ఆధారముగనో, ఎన్నియో కథలు జానపదుల వ్యవహారములో ప్రచారములో కలవు.

ఈ ప్రకరణమున జానపదులు కొన్ని పౌరాణిక గాధలను పరించియు, మరికొన్ని కథల ననుసరించియు, సృష్టించుకొనిన సామెతలను వివరించినాము. ఈ సామెతలందలి కథలను, జానపదుల నుండి స్వయముగా విని, వారు చెప్పిన విషయమునకే, అతిశయోక్తి అనక ప్రాధాన్యమిచ్చినాము.

---

1 ఈ కథ వివరించినది శ్రీమతి బి. సాకేత, గూడెం గ్రామము

# తులనాత్మక పరిశీలన

సామెతలు ప్రపంచము నందలి అన్ని భాషల యందును సర్వ సామాన్యముగా అగుపించు చుండును. మానవులందరును ఒకటే, కాని వారి వారి అనుభవములు, అనుభూతులు, ప్రాంతీయ వేషభాషలు, సంస్కృతి, భిన్నముగా ఉండును. అందువలన, వీరందరూ వెలువరించు సామెతలు స్వభావాది విషయములందు పరస్పర సన్నిహితత్వమును, ప్రత్యేక సంస్కృతి విషయమున భిన్నత్వమును ప్రదర్శించు చుండును.

ఉదాహరణమునకు,మానవులు అందరు ఆహారమును స్వీకరించినను వారి ఆహారమున గల పదార్థముల మధ్య భిన్నత గలదు. అదే విధముగా, 'సామెత'లు అన్ని భాషల యందును అగుపించు చున్నను. వారి వారి ప్రత్యేక జీవిత విధానములను అందు ప్రదర్శించు చుండును.

ఒకే దేశమున, ఒకే సంస్కృతిన గల సామెతల మధ్య సామ్యములు, అంతరములు అగుపించు చుండును. దీనికి వారి వారి మూలానుభవముల మధ్య మరియు మనస్తత్వముల మధ్య సామ్యము,మరియు వారు ఉపయోగించు ఉపమాది వస్తు వివరణల యందు గల అంతరము కారణముగా పేర్కొనవచ్చును.

భారతదేశము నందలి వివిధ భాషల యందు సామెతలు గలవు. వీని మధ్య చాల విషయములందు సామ్యమును గమనింప వచ్చును. ఒకే హైందవ సంస్కృతి నాగరికతలకు చెందిన వారగుట వలనను, మరియు వీరికి గల ప్రధాన ఐతిహాసిక గ్రంథములు ఒకటే అగుట వలనను ఇచ్చట మహాత్ముల సూక్తులును, దీనికి కారణము లగు చున్నవి. కేవలము వాని మధ్య సమీప వస్తువును వర్ణించు విషయమునందే అంతరము అగుపించుచుండుట కలదు.

కొందరు 'సామెత' లు ఒక ప్రాంతము నుండి మరొక ప్రాంతము నకు వ్యాపించుచుండుట వలన, వాని మధ్య సామ్యము కలదు. అని అభి

ప్రాయ పడిరి. కాని సంస్కృతి నాగరికతల యందు సామ్యము గల కొన్ని భాషల సామెతల యందు మాత్రమే ఈ సూత్రము వర్తించును.

వివిధ భాషల ప్రాంతముల మధ్య గల సామెతల విషయమున, రెండు అభిప్రాయములు విజ్ఞులు వెలువరించిరి. సామెతలు ప్రత్యేకముగా ప్రతిప్రాంతమున వెలయుననియు, వాని మధ్య గల సామ్యమునకు, మనో ధర్మము నందలి సాన్నిహిత్యమే కారణమనియు ఒక అభిప్రాయము. ఒక 'సామెత' ఒక చోట పుట్టి పలు ప్రాంతములకు వ్యాపించునను అభిప్రాయము రెండవది.

## వివిధ భాషల సామెతలు

ఆంగ్లము :

ఆంగ్లమున సామెతను 'ప్రోవర్బ్' (Proverb) అందురు. 'ప్రోవర్బ్' అనగా 'మామూలు మాట' (A Common saying) అని అర్థము. అంతర్జాతీయ భాషయగు ఆంగ్ల భాష యందలి సామెతలకు, తెలుగు భాష యందలి కొన్ని సామెతలకు మధ్య సామ్యములను గమనింపవచ్చును. కాని కొన్ని చోట్ల ఉపమానము స్వీకరించుట యందు భిన్నత అగుపించుచుండును. ఉదా! "Cut your coat according to the cloth" అది వస్త్రమును బట్టి దుస్తులు కుట్టించుకొనవలయును, అని అర్థము. అందు దుస్తుల ప్రాధాన్యతను ఉపమానముగా స్వీకరింపబడినది అదే అర్థమును వివరించు సామెత తెలుగు నందును గమనింపవచ్చును.

'మంచమున్నంతె కాళ్ళు చాపు కోవాలి' అచ్చట మంచమును ఉపమానముగా స్వీకరించిరి. ఈ రెండు సామెతల యందు, భావసామ్యము అగుపించుచున్నది. అభివ్యక్తి యందు మాత్రమే భిన్నత్వము కలదు.

'A bad work man blames his tools' అందు పని చేత గాని వాడు తన పరికరములను నిందించునను భావము కలదు అదే భావమున.

'అదరాక మద్దెలోడు' అను సామెత తెలుగు నందు గలదు. ఇచ్చట అదరాని వాడు మద్దెల (వాయిద్యము) ఓడు పోయిందని, నిందించినాడను అర్థము వివరింపబడినది. ఈ సామెతలందు వ్యక్తీకరణమున గల భావము ఒకటే అయినను ఉపమాన వస్తువునందు మాత్రము అంతరము కలదు.

'Slow to work but quick to eat' ఈ ఆంగ్ల సామెత యందు యందు పనికి వెనుకాడు తిండి పోతు గురించి వివరింపబడినది. ఇదే భావమును ఉపమాన పూరకముగా తెలుగున 'తిండికి తిమ్మరాజు పనికి పోతురాజు' అని వివరించినారు.

'Christams comes but once in a year' ఈ ఆంగ్ల సామెత యందు 'క్రిష్టమస్' సంవత్సరానికి ఒకే మారు వస్తుంది. అని మంచి రోజు అరుదుగా వస్తుందను అర్థమున వివరించినారు. ఇదే భావమును యథాతథముగా తెలుగు సామెత యందును గమనింప వచ్చును.

'సంక్రాంతి పొలుకొక సారె' ఈ రెండు సామెతలు సామ్యము గలవి. వీనిలో ఎవరి సంస్కృతికి చెందిన పండగలను వారు ఉదాహృతిగా స్వీకరించిరి.

'Give him an inch and he will take an all' ఈ ఆంగ్ల సామెత యందు కొందరు వ్యక్తుల స్వభావము వివరింపబడినది. వీరికి ఒక చోట కొద్ది ఆశ్రయము ఇచ్చినచో, మొత్తము స్థలము ఆక్రమించు స్వభావము గలదని చెప్పబడినది. ఇదే భావమును,

'ఇసంతరమ్మంటె ఇల్లంత నాదన్నాడు' అను తెలుగు సామెత యందు సౌందర్యవంతముగా, సూటిగా వ్యక్త పరచినారు.

ఈ విధముగా పెక్కు సామెతలు ఆంగ్ల, తెలుగు భాషలందు సామ్యములుగా అగుపించు చున్నవి.

సంస్కృతము :

భారతీయ భాషలన్నిటిపైనను సంస్కృతము ప్రభావము కలదు. సంస్కృతమున సామెతలను 'లోకోక్తులు' లేదా 'న్యాయములు' అని వ్యవహరింతురు. లోకోక్తి అనగా లోక వ్యవహారమందలి మాట అని అర్థము.

లోకోక్తులు :

సంస్కృతమున 'యాదృశీమాతా తాదృశీపుత్రీ' అను సామెత తెలుగున 'తల్లి తీరు పిల్ల' అను సామెతగా కనిపించుచున్నది.

సంస్కృతమున 'ఉదరనిమిత్తం బహుకృత వేషం' అను సామెత కొద్ది మార్పుతో 'వేషమేస్తే గాసమొస్తది.' అని తెలుగుసామెత.

సంస్కృతమున 'ముసలం కిసలాయతే' అను సామెత 'రోకలి బండకు చిగురుపెట్టినట్లు' తెలుగు రూపమున కనిపించుచున్నది.

సంస్కృత లోకోక్తి 'ఋణమ్ కృత్వా ఘృతమ్ పిబేత్' అనగా అప్పు చేసి నెయ్యి త్రాగుట అనునది తెలుగున 'అప్పు చేసి పప్పుకూడు తినుట' అనురూపమున ఉపమాన భేదముతో అగుపించుచున్నది.

న్యాయములు :

సంస్కృతము నందలి న్యాయములు కొన్ని తెలుగు సామెతలుగా కనిపించుచున్నవి.

'అల్లేదు సుల్లేదు కొడుకు పేరు సోమలింగం'ఈ తెలుగు సామెతకు 'అజాత పుత్రనామోత్కీర్తన న్యాయము' సంస్కృతమున కలదు. అనగా పుట్టని కుమారునికి పేరు పెట్టుట అని దీని అర్థము.

'ఊరుకు చేసిన ఉపకారం పీనుక్కుచేసిన శృంగారం' ఈ జానపద సామెత యందలి పీనుక్కు చేసిన శృంగారం అను అర్థమును ఈ 'శవోద్వర్తన న్యాయము' వివరించు చున్నది. శవమునకు గంధలేపనము కావించుట అని దీని అర్థము. అనగా వ్యర్థమగు పని అని భావము.

ఈ విధముగా తెలుగు సామెతలను పోలిన సామెతలెన్నియో సంస్కృతమున కూడ గలవు.

## హిందీ :

భారతీయ భాషలన్నిటి యందును హిందీ భాష అగ్రగామిగా ఉన్నది. తెలుగు భాష యందలి సామెతకు హిందీ యందు సమానార్థకమగు పదము 'కహావత్' అని కలదు. అనగా 'చెప్పిన మాట' అని అర్థము.

తెలుగు సామెతలను పోలిన సామెతలు హిందీ అందు అగుపించుచున్నవి.

'తావోటితలిస్తె దైవమోటి తలుస్తది' ఈ తెలుగు సామెతకు సమానమగు సామెత 'ఇన్‌సాన్‌బనాయే ఖుదాదాయే' అని హిందీ భాషలో కలదు. మనిషి చేసిన దానిని దేవుడు కూలద్రోయును. అని ఈ సామెత అర్థము.

'అందని ద్రాక్ష పుల్లన' దీనికి 'అంగూర్ ఖట్టేహై' అను సామెత హిందీ యందు యథాతథముగా కలదు.

'మొగున్ని కొట్టింది మొరపెట్టింది' ఇది తెలుగు సామెత. ఇదే భావమును స్ఫురింపచేయు హిందీ సామెత గలదు.

'ఉల్టాచోర్ కొత్వాలీకోడాంటే' అనగా దొంగయే తలారిని నిందించినాడను అర్థము వివరించబడినది. తెలుగు సామెత యందు భార్య భర్తలను ఉపమానముగా స్వీకరించగా హిందీ యందు దొంగ, తలారి ఉపమానముతో అదే భావమును వెలువరించినారు.

'రామాయణమంతా విని రామునికి సీతేమైతదన్నడట' ఇది తెలుగున గల రామాయణ గాథా సంబంధమగు సామెత. ఈ సామెత యథాతథముగా హిందీ యందు గలదు. 'సారీరామాయణ్ సున్‌కర్ పూఛా, సీతా కిస్‌కీ జోరూథీ' 'అదరాక మద్దెలోడు' 'అదరాక తొర్రి గజ్జెలు' ఇవి తెలుగు నందుగల సామెతలు, ఇదే భావమును అందించు సామెత 'హిందీ' యందు గలదు.

'నాచ్ నజానే అంగన్‌టెడా' అనగా నాట్యము తెలియక, వేదిక వంకరగా ఉన్నదని అనుట, అని అర్థము. తెలుగు నందును హిందీ యందును నాట్యము ఉప మానముగా స్వీకరించిరి. తెలుగు సామెతన 'మద్దెల' 'గజ్జెలు' మంచివి కావని వివరింపగా హిందీ యందు వేదిక బాగులేదని వివరింపబడినది.

"కడుపునిండితే గారెలు కసరుకినరు" ఈ తెలుగు సామెతకు సరిపోవు సామెత హిందీ యందు కూడ గలదు.

"భరేపేట్‌పర్ శక్కర్ ఖారీ" అనగా కడుపు నిండిన వారికి, పంచదార ఉప్పుగా ఉంటుందని అర్థము వివరింపబడినది. తెలుగున గారెలు ఉపమగా స్వీకరింపగా హిందీ యందు పంచదారను స్వీకరించి అదే అర్థమును వివరించిరి.

"అయ్యవారిని చెయ్య పోతె కోతయింది" ఈ సామెతకు సమానమగు సామెత హిందీ యందు ఈ విధముగా గలదు.

'పకానేథీఖీర్ హోగయాదలియా' అనగా చేసేది పాయసము అయినది ఉప్మా (ఉప్పుపిండి) అను అర్థము వివరింపబడినది. ఒకటి చేయబోవ నొకటి అయి నదను తెలుగు సామెత యందలి భావమును ఇందు వివరించిరి.

'మూడోస్త్రీజుమైతే మురికి చట్టం' ఈ సామెతకు సమానమగు సామెత హిందీ యందును ఇదే భావము నిచ్చునది గలదు.

'ఏక్ దిన్‌కాపావనా దూస్‌రే దిన్ అన్ భావనా' అనగా మొదటి రోజు అతిథిగా గౌరవింపబడినవారు, రెండు రోజులు గడిచినచో నిరాదరణ పొందుదురను భావము వివరించినారు.

## మరాఠీ :

మహారాష్ట్రము నందలి ప్రజల భాష మరాఠీ. ఈ ప్రాంతము భారతదేశమునకు పశ్చిమ తీరమున దక్షిణమున గోవా నుండి ఉత్తరమున నాగపూర్ వరకు వ్యాపించి యున్నది. ఇది తెలుగు రాష్ట్రమునకు పరిహద్దున కలదు.

మరాఠీ యందు సామెతను 'మహ్ణ' అందురు. 'మహణ్ణ' అని కూడ వ్యవహరింతురు. తెలుగు సామెతలను పోలిన సామెతలు మరాఠీ యందు కూడ అగుపించు చున్నవి.

"అల్లుడు రాలేదని అమావాసాగుతాది ఈ సామెతను పోలిన సామెత మరాఠీ యందును కనిపించుచున్నది.

"మాహతారీనే కొంబ్డా ఝాక్లా మణూన్ పహాట్ వ్హాయిచి రహాలా నాహీ" అనగా ముసల్ది కోడిని దాచి పెట్టిన ఉదయము అగుతుందా? లని అర్థము. తెలుగు సామెత యందు అల్లుడు అమావాస్య ఉపమగాను, మరాఠీ యందు కోడి ఉదయము. ఉపమలుగాను స్వీకరింపబడినవి. ఈ రెండు సామెతలందు ఒకే భావముకలదు.

"అత్త మీది కోపము దుత్త మీద తీర్చె" ఈ తెలుగు సామెతను పోలిన సామెత మరాఠీ యందు మరో ఉపమానముతో వివరింపబడినది.

'లేకీ బోలే సునే లాగె' అనగా కోడలిపైన కోపము కూతురుపై తీసివదని ఈ సామెత అర్థము.

'ఆడరాక పందిరి కురుచ' ఈ సామెతను పోలిన సామెత మరాఠీ యందు యథాతథముగా.

'నాచ్‌తా ఏయినా అంగణ్ వాకడే' నాట్యము చేయరాకపోయినను, అంగణము బాగులేదనుట' అని గలదు.

'మంచమున్నంత కాళ్ల చాపుకోవాలి' ఈ సామెత మరాఠీ యందు యథాతథముగా.

'అంథరూణ్ పాహూన్ పాయ్ పసరణే' అని గలదు.

'ఎద్దున్నోనికి బుద్ధుండదు బుద్ధున్నోనికి ఎద్దుండదు' ఈ సామెతను పోలిన సామెత మరాఠీ యందు భేదముతో కానిపించుచున్నది.

'చనే ఆహేత్ తేథే దాత్ నహీత్ దాత్ ఆహేతేథే చనే నహీత్' అనగా శనగలుంటె పండ్లులేవు. పండ్లుంటె శనగలు లేవు అని అర్థము వివరింపబడినది.

'మొగున్ని కొట్టింది మొరపెట్టింది' ఈ సామెతను పోలిన మరాఠీ యందు కొద్ది ఉపమానభేదముతో అగుపించును.

'చోరాచ్యా ఉల్టయా బోంబా' అనగా దొంగతనము చేసి అరచుచున్నాడని అర్థము.

## కన్నడము :

తెలుగు సీమకు పొరుగు రాష్ట్రము కర్నాటక ప్రాంతము. ఇచట జనుల మాతృభాష కన్నడము. కన్నడమున సామెతలను 'గాదె' అందురు. గాదె, గాథా శబ్దభవము. నాణ్ణుడి (నానుడి) అనుట కూడ కలదు.

తెలుగు సామెతలకు సామ్యమగు సామెతలు కన్నడమున చాల గలవు.

అనంతయ్య మాత్ర వైకుంఠయాత్ర
నీ చేతి మాత్ర వైకుంఠయాత్ర ఈ సామెతలను పోలిన సామెత

'అనంతయ్య మాత్రె వైకుంఠ యాత్రె' అని కన్నడమున యథాతథముగా కలదు.

'ఆదేకాలు పాదేనోరు ఊరుకుండదు' అను తెలుగు సామెత.

'అడిద కాలూ హాడిద బాయియూ సుమ్మనిరదు' అని కన్నడమున గలదు.

'అల్లుడు రాలేదని అమాసాగుతాదా' ఈ తెలుగు సామెతను పోలిన సామెత కన్నడమున 'అయ్యన వరిల్ల దిద్దరె అమావాస్యె నింటితె' అని గలదు.

'గంతకు దగ్గ బొంత' ఈ సామెతను పోలిన సామెత

'కంతెగె తక్క బొంతె' అని కన్నడమున గలదు.

'గోడలకు చెవులుంటయి' అను ప్రసిద్ధ సామెత కన్నడమున

'గోడెగళిగె కివిగళివె' అని యదాతథముగ కానిపించుచున్నది.

'తానోటి తలిస్తే దైవమోటి తలుస్తది' అను సామెత కన్నడమున యథాతథముగా

"తాను యోచిసువు దొందు దైవ బగెయువు దొందు" గలదు.

ఈ విధముగా, తెలుగునకు అత్యంత సన్నిహిత భాషయగు కన్నడమున తెలుగుకు సామ్యమగు సామెతలెన్నియో అగుపించును.

తమిళము :

తెలుగు ప్రాంతమునకు పొరుగు రాష్ట్రము తమిళదేశము. తెలుగు వారి సంస్కృతికి అత్యంత సన్నిహితమగు సంస్కృతి గలవారు తమిళులు.

తమిళమున సామెతలను "పళమొళి" అందురు. అనగా 'పాతమాట' అని అర్థము గలదు. తెలుగు సామెతలను పోలిన తమిళ సామెతలు ఎన్నియో కలవు.

ఉదా: "అయ్యగారు వచ్చేదాక అమవాస్య ఆగుతుందా" ఈ సామెతను తమిళమున "అయ్యర్ వరగిరవరై అమవాసై కాత్తిరుక్కుమా" అని అందురు.

'తేలుకు పెత్తన మిస్తే తెల్లవార్లుకుట్టును' ఈ సామెత

'తేలుక్కు మణియం కుడుత్తాళ్ నిమిషత్తుక్కు నిమిషం కొట్టు'అని తమిళమున గలదు.

'అందితె సిగ అందక పోతే కాళ్ళు' ఈ సామెత తమిళమున

'ఎట్టినాల్ తలమైప్పిడి ఎట్టావిట్టాల్ కాలైప్పిడి' అనిగలదు.

'ఇల్లు కట్టి చూడు పెండ్లిచేసి చూడు' ఈ సామెత తమిళమున

'వీట్టి కట్టి ప్పార్ కల్యాణం పణ్ణిప్పార్' అని కలదు.

'ఢిల్లీకి రాజైనా తల్లికి కొడుకే' ఈ సామెత తమిళమున కొంచెది మార్పుతో

'ఊరుక్కు అరస నానాలుమ్ తాయిక్కు పిళ్ళైదాక' లనగా ఊరుకురాజైనా తల్లికి పిల్లవాడే అను అర్థమున గలదు.

'ఒక్క కన్ను కన్ను కాదు ఒక్కకొడుకు కొడుకు కాదు' ఈ సామెత తమిళమున

'ఒరుపిళ్ళైపిళ్ళై యాగుమా ఒరుమరం తోప్పాగుమా' అని గలదు.

'ఒకనాటి భాగోతానికి మూతి మీసం గొరిగించుకున్నాడు'

'ఒరునాళ్ కూత్తుక్కు మీసైయైచ్చిరైక్కలామా' అని తమిళమున గలదు.

ఈ విధముగా ఎన్నియో సామెతలు తమిళమున అగుపించుచుండును.

## మళయాళము :

ద్రావిడ సంస్కృతికి చెందిన తెలుగు, కన్నడ, తమిళ ప్రజల వలె మళయాళీలు కూడా ఇదే సంస్కృతికి చెందినవారు. ఈ ద్రావిడ భాషలన్నింటి యందును నాగరికత యందు పరస్పర సామ్యము అగుపించుచుండును.

మళయాళమున సామెతను "పళంచోల్లు"అందురు. తెలుగు నందలి సామెతలను పోలిన సామెతలెన్నియో మళయాళమున కూడ అగుపించుచున్నవి.

"ఆడేకాలు పాడే నోరు ఊరు కుండదు" ఈ సామెత 'అడియాకాలుమ్ పాడియనావుమ్ వెరుతె యిరిక్కల్లి' అని మళయాళమున గలదు.

'ఒక నాటి భాగోతానికి మూతి మీసం గొరిగించుకున్నాడు' ఈ సామెత మళయాళమున 'ఒరునాళ్ కూత్తిను మీశచెంకెత్తెణమో' అని గలదు.

'గాడిద పుండుకు బూడిద మందు' ఇది మళయాళమున 'నాయిరు పుణ్ణిను బాంబలు మరున్ను' అని గలదు. అనగా కుక్క పుండుకు బూడిద, మందు అను అర్థము గలదు. తెలుగున 'గాడిద' ఉపమానము, మళయాళమున కుక్క ఉపమానముగా వాడబడినది.

ఈ విధముగా తెలుగు సామెతలను పోలిన సామెతలెన్నియో మళయాళమున అగుపించుచున్నవి.

'అందని ద్రాక్ష పల్లన' ఈ సామెత ప్రసిద్ధ ఆంగ్ల కథ ద్వారా వెలసినదైన ఈ సామెత ఆంగ్లముతో పాటు హిందీ, తెలుగు, తమిళ, కన్నడ, మళయాళ భాషలందు యథాతథముగా అగుపించుచున్నది.

అదే విధముగా 'రామాయణ మంతా విని రాముడికి సీతేమైతదవ్వడట' అను సామెత భారతీయులందరికి పవిత్ర గ్రంథమగు రామాయణము ననుసరించి

వెలసినది. ఇది దాదాపు అన్ని భాషలందు అగుపించు చున్నది. ఇందు ఈ సామెత హిందీ, తమిళ, కన్నడ, మళయాళ భాషలందు గలదని వివరింపబడినది.

ద్రావిడ భాషలకు తెలుగు, తమిళ, కన్నడ, మళయాళ భాషలందు గల సాన్నిహిత్యము వలననే, వాని సామెతలందును, అత్యంత సాన్నిహిత్యము గలదు. భావ వ్యక్తీకరణమున, ఉపమాన విషయమునకు ఈ పోలిక దగ్గరగా కలదు.

సంస్కృత భాష ప్రభావము అన్ని భారతీయ భాషలపైనను కలదు. కావున సంస్కృత లోకోక్తుల ప్రభావము అన్ని భారతీయ భాషలపైనను తప్పని సరి.

ఈ ప్రకారమున పాశ్చాత్య భాషయగు ఆంగ్లము భారతీయ భాషలకు సంస్కృత, మరాఠీ, హిందీ భాషల సామెతలతో, తెలుగు సామెతలను తులనాత్మకముగా పరిశీలింపబడినవి. ద్రావిడ భాషలగు తెలుగు, తమిళ, కన్నడ, మళయాళము లందు గల సామెతల పరస్పర సంబంధ సాన్నిహిత్యములను వివరింపబడినది.

# భాషా విశేషాంశములు

## సామెతలు – జాతీయములు :

జానపదుల సామెతలను, జాతీయములను పరిశీలించినచో రెంటి మధ్య కొన్ని పోలికలు, భేదములు కన్పించుచున్నవి.

'సామెత' అనుభవ పుత్రిక, మానవుల సామాన్య అనుభవసామ్యము వలన అది అన్ని భాషలందు ఒకే విధముగా కూడ కనిపింప వచ్చును. కాని 'జాతీయము' ఏదో ఒక జాతి యందు పుట్టినది, ఒక జాతి స్వంతముగా, స్వతంత్రముగా సృష్టించు కొనినట్టిది.

సామెతలకు వలెనే జాతీయముల పుట్టుక గూడ స్పష్టముగా వివరింపజాలము. కాని, ఇవి అతి ప్రాచీన కాలమున ఏదో ఒక సందర్భమున వాడబడి, ప్రజా వ్యవహారమున నలిగి, ప్రాచుర్యము పొంది భాష యందు నిలచి పోయినవని ఊహింపవచ్చును. ఇవి వైయక్తికముగా పుట్టి తదుపరి సామూహిక వికాసమును పొందినట్టివి

సామెతలు, జాతీయములు, సంక్షిప్త రూపమున విశిష్ట భావములను సమగ్రముగా ప్రతిబింబింప గలవు. సామెతల కన్న మరింత సూక్ష్మరూపములు 'జాతీయములు'.

ఒక జాతి యొక్క సంస్కృతి స్వభావములను, ఆచారవ్యవహారాదులను, సంఘ జీవన విధానము, సరళముగా వివరించు శక్తి రెంటికిని గలదు. ధ్వని, సరళ భాషా ప్రయోగము రెంటి యందును గమనింప వచ్చును.

సామెతలకు వలె జాతీయములు స్వతంత్రముగా, ప్రయుక్తము కావు. ఇవి వాక్యము నందు ఒదిగి జీవింప వలసినవి. అట్లు కానిచో వానికి సంపూర్ణార్థము సిద్ధింపదు.

ఉదా:- ఒక వ్యక్తి స్వభావమును 'తిన్నింటి వాసాలు లెక్క పెట్టేందు' అను సామెతన, ఆ వ్యక్తి నమ్మక ద్రోహమును స్పష్టముగా స్వతంత్రముగా వివరింప గలము.

జాతీయము అట్లుగాక సంభాషణ మధ్యమున గాని ప్రసంగవశమున గాని ప్రయోగింప వలయును. లేనిచో అర్థరహితముగా కన్పించును.

ఉదా:- 'నమ్మకరాం' ఈ జాతీయము స్వతంత్రముగా ప్రయోగించుట కన్న 'వాడు పెద్ద నిమ్మకరాం' అని వాక్యమందు వివరించిననే అర్థము స్పష్టమగును. ఇది హిందీ నుండి తెలుగులోనికి వచ్చిన జాతీయము. "నమ్మకరాం" అనగా ఎవరింటనైతే ఉప్పు తిన్నాడో వారికే ద్రోహము చేసినాడని అర్థము.

సామెతలు ఎక్కువగా అన్యోక్తి, ఉపమా, రూపములుగా కన్పించును. కాని జాతీయములు ధ్వన్యంశము, ఎక్కువగా లేని స్పష్టార్థము నిచ్చు రూపములు.

భాష యందు జాతీయములు చమత్కారమును సృష్టించు చుండును. సామెతలు ఏదో ఒక విషయమును సమర్థించు చుండును. సామెతలు, జాతీయములు రెండును భాషకు అలంకారములు

జాన పదుల సామెతలకు వలె జానపదుల జాతీయములను గుర్తింపవచ్చును.
ఉదా:- 'ముత్తైమంత', 'ఎన్నముద్దోలె', 'మక్కికి మక్కి' వంటివి, సహజ సుందర జానపద జాతీయములకు మచ్చు తునకలు.

సామెతలకు వలె జాతీయములను అందు ప్రయుక్తమైన విషయమును అనుసరించి వివిధ వర్గములుగా విభజించు కొనవచ్చును. 1) వ్యక్తి స్వభావ చిత్రణ సమర్థములు (2) సామాజిక సంబధములు (3) గాథా సంబంధములు (4) తదితరములు

1) సామెతలకు జాతీయములందు మానవ స్వభావ చిత్రణ కాన్పింపగలదు.

ఉదా:- వాడునల్లి, గోడ మీది పిల్లి, తేలకొండి, వాడుబల్లి, ఉసరవెల్లి ఇవి ఆయా వ్యక్తులవిచిత్ర స్వభావములకు ప్రతీకలు

2) సామెతలందు వలె జాతీయములందు సామాజిక జీవనము గురించి విశేషములు వివరింపబడినవి.

ఉదా:- పెండ్లి నడకలు, నాగవల్లి నిష్ఠూరము. శోభనం పెండ్లి కొడుకు వంటివి గలవు

3) సామెతల వలె జాతీయములు కూడా ఏదో ఒక సంఘటన ఆధారముగా లేదా పౌరాణిక గాథ ఆధారముగా కూడ పుట్టు చుండును

ఉదా:- నక్షత్రకుడు, కుంభకర్ణుడు, ఉడుతాభక్తి వంటివి

4) సామెతల వలె జాతీయములు కాలాను గుణముగా మార్పు చెందుటయో లేదా అదే భావమున మరియొకటి పుట్టుటయో జరుగును.

ఉదా:- బల్ల కింద చేతులు : ఈ జాతీయము వర్తమాన మందు పుట్టినది. ఇందు లంచం పుచ్చుకునే వారి రహస్య చర్య వివరింపబడినది. 'లంచము' అనునది అవినీతి, కనుక దానిని రహస్యముగా స్వీకరింతురు. అనుదానిని గుట్టుగా 'బల్ల కింద చేతులు' అని వివరించబడినది.

తడిపిందు : ఇది కూడ లంచము గురించి పుట్టిన జాతీయము, నేటి సామాజిక పరిస్థితుల ననుసరించి పుట్టినట్టిది. ఇందు 'లంచము' ఇచ్చు వారి గురించి చెప్పబడినది. 'లంచము' ఇచ్చుట కూడ పుచ్చుకునుట వలె నేరము. వారు తమ పనులను, ఏదో తడిపి చేయించుకున్నాడు అనగా, ఏదో 'దారపోసి' సాధించినాడని అర్థము. నిజమునకు దారపోయునపుడే గదా చేయి 'తడుచుట' దాని నుండి 'లంచము' నకు 'తడిపిందు' అను పదము పర్యాయ పదముగా మారినదని ఊహింప వచ్చును.

డింకీలు కొట్టిందు :- ఇది పరీక్షలందు 'ఫేయిల్' అయిన వారి గురించి పుట్టిన జాతీయము 'ఫేయిల్' అయినాడనుటకు, పరీక్షలో పడిపోయినాడనుట గలదు. దాని నుండియే వ్యంగ్యముగా పరీక్షలో డింకీలు కొట్టినాడనియు, మరింత చిన్నగా 'డింకీలు' అనగా 'పల్టీలు' కొట్టినాడనియు అనుటగా మారినదని ఊహింపవచ్చును.

అట్లే ఇతర భాషలందలి నుడికారములను అనువదించు కొనినప్పుడు కూడా కొన్ని జాతీయములు కొత్తగా ఏర్పడుచుండును.

ఉదా:- "నమ్మకరాం" ఇది 'నమక్ హరాం' అను హిందీ జాతీయము తెలుగున "నమ్మకరాం"గా మారినది. దీనికి రెంటి యందు అర్థము ఒకటే. 'ఉప్పు తిన్న వారింటికే ద్రోహము చేసినాడని' అనగా కృతఘ్నుడు' అని వివరింపబడినది

సామెతలు జాతీయములు రెండును భాషయందు ప్రముఖ స్థానమును పొంది

యున్నవి. నేదునూరి గంగాధరం గారు వీని విశిష్టతను గురించి 'ఇవి సాంఘికముగా జాతీయముగా, సాంస్కృతికముగా, వైజ్ఞానికములుగా అనేక నిత్యసత్యములను తెలుపు అర్థములు అనుశ్రుతములుగా వచ్చే పెన్నిధులు. వాని యందు అనుభవము, విజ్ఞానము పరిజ్ఞానము అంతర్లీనముగా నుండుటయే గాక జాతిని పటిష్ఠము చేయుశక్తి యున్నది. ఇవి రెండును కొద్ది మాటలలో బహుళార్థములిచ్చును, బహుప్రచార యోగ్యములుగా నున్నవి.' 43 అని వివరించినారు.

## శిష్ట - జానపద భేదములు :

సామెతలు జానపద సారస్వతమునకు చెందినట్టివి. అయినను వీని యందు 'శిష్ట-జానపద' భేదములను గమనింప వచ్చును. శిష్టుల వ్యవహారమున వారి రచనల యందు, ప్రయోగింపబడు సామెతలు, శిష్ట సామెతలు జానపదుల వ్యవహారమున, వారి రచనల యందు ప్రయుక్తములగు సామెతలు, జానపదుల సామెతలుగా వివరింపవచ్చును

ఈ సామెతలందు భేదముకన్న, సామ్యము మిన్నగా కన్పించుచుండును. వీని మధ్య భేదము కేవలము శైలి విషయమునను, తమ తమ పరిసరములకు, పరిమితులకు చెందిన ఉపమానములు ప్రయోగించుట యందును, తమ ప్రాంతమునకు చెందిన వాడుక భాషను వాడుట యందును మాత్రమే గమనింపగలము. సామెతలకు గల తదితర లక్షణములు. శిష్ట-జానపదుల సామెతలందు సమముగా ఉండును.

శైలి : జానపదుల సామెతలందు ప్రయుక్తమగు భాష వాడుక భాష, లేదా గ్రామ్యభాష కాని శిష్టుల సామెతలందు, విద్యావంతుల భాష ప్రయోగింపబడును.

ఉదా:- 'చదువుకున్న వాడి కంటె, చాకలి మేలు శిష్టుల' సామెత
'చదువుకున్నోనికన్న, చాకలోడునయం ఇది జానపద శైలి'

'ఊరు రావద్దు పైతా అంటే, గుడ్డాన్నేద కట్టేదన్నాడట' శిష్టుల సామెత
'ఊర్లే కద్దంటే, గుడ్డాన్నేద కట్టేయమంటడట' ఇది జానపద శైలి

'ఆవులు ఆవులు కుమ్ములాడితే, లేగల కాళ్ళు విరిగినట్లు' శిష్టుల సామెత.

'అవులావులు కొట్లాడి లాగెలకాళ్ళిరగ్గొట్టినయి' ఇది జానపదులది.

'ఎముక లేని నాలుక, ఏమైనా పలుకుతుంది' ఇది శిష్ట జన ప్రయోగము.

'నరంలేని నాలిక, ఏమైనా తిరుగుతది' ఇది జానపదశైలి.

'ఓ పనివారికి వద్దన్నవారే తల్లిదండ్రులు' ఇది శిష్టుల సామెత.

'పంగలేనోనికి వద్దన్నోడే తల్లిదండ్రి' ఇది జానపద సామెత

'జుట్టు వున్న అమ్మ, ఏ కొప్పయినా పెట్టవచ్చు' శిష్టుల సామెత

'ఎంటికలున్న కొప్పు, ఎటు పెట్టినా సుంగారమే' ఇది జానపదుల శైలి

'పేమగకు చేసిన శృంగారం, నగరికి చేసిన కొలువు' శిష్టుల సామెత

'ఊరుకు చేసిన ఉపకారం, పేముక్కు చేసిన సుంగారం' జానపద శైలి.

## ఉపమాన భేదము :

శిష్ట జనులు తమ స్థితిగతులకు, జీవన పద్ధతులకు సరియగు ఉపమానములు, తమ వ్యవహారమునందు గల సామెతలలో ఉపయోగించుకొందురు, జానపదులు కూడా తమ పరిస్థితులకు, జీవన విధానమునకు చెందిన ఉపమానములనే స్వీకరించి సామెతలందు ప్రయోగించుట గమనింపవచ్చును.

'మింగ మెతుకు లేదు మీసాలకు సంపెంగ నూనె' ఇది శిష్టులు వాడు సామెత. ఇందు వీరు వాడిన ఉపమానము వారిలో గల ఆడంబర జీవితమును వివరించుచున్నది. ఇదే భావమును స్ఫురించు సామెతను, జానపదులు తమ పరిధిలోని ఉపమానము స్వీకరించి, 'కూస్తె కుప్ప లేదు గని, కుంపెట్లకు ముత్యాలు' అని వివరించిరి.

అదే విధముగా శిష్టులు, 'తాను తిన తౌడు లేదు గని,వారాంగనకు పడియాలు' అని వివరింపగా, దీనినే జానపదులు, 'తానుబుక్క తౌడు లేదు, లంజకు పాన్‌దాన్' అని వర్ణించిరి.

'కూర్చొని రాతు తియ్యనోడు, ఏర్చొని రాతు తీస్తాడు' ఈ జానపద సామెత యందు, జానపదులు తమ సహజ ధోరణిలో, కూడు, ఏరువంటి అను నిత్యము సమీపమున వారు గాంచు వానినే ఉపమానముగా స్వీకరించి చక్కని భావముతో ఈ సామెత సృష్టించినారు. ఇదే భావమును స్ఫురింప చేయు శిష్టుల సామెత 'కాలువ దాటలేని వాడు, కడలి దాట గలడా' అనునది. ఇందు శిష్టులు కడలివంటి సుదూర విశేషము ఉపమానముగా స్వీకరించిరి.

ఈ విధముగా శిష్ట-జానపద సామెతలందు, కొన్ని అంతరములను గమనింప వచ్చును. వీని మధ్య గల భేదములను గురించి డా॥ అర్. వి. యస్. సుందరంగారు

"జానపదుల సామెతలు, సహజంగా జన్మించినవి. మిగిలినవి చాల వరకు కల్పితమైనవి. ప్రాస, లయ, ఛందస్సు, వగైరా ప్రయత్న పూర్వకంగా చేర్చి, కవులు, విద్యావంతులు అటు వంటి సామెతల్ని రూపొందిస్తారు. జాన పదుల సామెత లది గ్రామ్యభాష, నాగరిక సామెతలది, గ్రంథస్థ సామెతలది, వ్యవహారిక భాష లేక గ్రాంధిక భాష, జానపదుల నుడికారము సొంపు వీనిలో అంతగా కనిపించదు" 44 అని అభిప్రాయపడిరి.

## యతి ప్రాసలు :

'ఆద్యోవళిర్ద్వితీయో వర్ణః ప్రాసో త్రిపాద పాదేషు' 45 అని అభిప్రాయపడిరి. అనగా తొలి అక్షరము వళి (యతి)అనియు దాని తరువాత అక్షరము ప్రాస మనియు అంధ్రశబ్ద చింతామణి వివరించినది. తెలుగున యతి స్థానమున పదచ్ఛేదము అవస రము లేదు.పాదాద్యక్షరమునో,తన్మిత్రాక్షరమునో యతి స్థానములో నిలుపవలెయును. తెలుగులో యతి అక్షుమైత్రి గలది. సంస్కృతమున కేవలము పదముల విరుపు మాత్రమే యతిస్థానముగా పాటింపబడగా తెలుగునో అచ్చులను హల్లులను పొంది యుండునదే యతియని నిర్ధారింపబడినది. తెలుగు భాషను స్వర మనోజ్ఞముగా, శ్రుతి పేయముగా తీర్చినది. యీ యతివి కూర్చు పద్ధతియే, తెలుగు వారు మామూలుగా మాట్లాడు కొమనప్పుడైనను యతిని పొందించుట. అను ప్రాసాది లక్షణమును తమ సంభాషణలో వెలయించుట మనము గుర్తింపవచ్చును. ఈ లక్షణము తెలుగు సామెతలలో ప్రస్ఫుటముగా కన్పించును.

పద్యములందు 'యతి' ప్రతి పద్యమునకు, తప్పని సరిగా నియమిత స్థానమందు అగుపించుచుండును. సామెతలందు మొదటి పాదములోని ప్రథమాక్షరము, రెండవపాదములోని ప్రథమాక్షరమునకు యతి చెల్లును. కాని నియతమగు సంఖ్య లేదు.

జానపదులు సామెతలను అప్రయత్నముగా, అనుభవముతో సృష్టింతురు. అందుచేత వీరి సామెతలందు కాన్పించు 'యతి' స్వరూపము రెండు విధములుగా నున్నది. 1) నియమ బద్ధ మగు యతి; 2) నియమరహితమగు యతి, అనగా ఏ నియమములకు కట్టుబడక ఏ రకమైన నిరుపులకు లొంగక స్వతంత్రముగా నుండుయతి. దీనిలో లయకు ప్రాధాన్యత కలదు.

## నియమ బద్ధ మగు యతి స్వరూపము :

ఈ క్రింది విధములగు యతి స్వరూపము జానపదుల సామెతలందు కాన్పించు చున్నది.

A స్వరమైత్రి : ఇందు అ, ఆ, ఐ, ఔ, ఋ, ఇ, ఈ, ఋ, ౠ, ఎ, ఏ, ఉ, ఊ, ఒ, ఓ, ఋ, తమలో తాము మిత్రములు. వీనిలో

i అకారయతి : 'అ–అ' లకు మైత్రి

'అట్లుపోసే అమ్మపుట్టి, అరుగురెత్తి వొయ్యాలి'

'అల్లుడు రాలేదని, అమాసాగుతది'

ii ఇత్వవళి : 'ఇ–ఇ' 'ఇఈ', ఎ–ఏలకు యతి చెల్లును.

'ఇమ్మడి పనికి, ఇద్దరు చేటు'

'ఇల్లలికి ముగ్గుపెడ్తె, ఈగం బాధ'

'ఎల్లయ్య గొంగడి, ఏపిన తాడ్నే'

iii ఉద్వీరామము : ఉ-ఉ, ఉ-ఊలకు మైత్రి

'ఉరుకులాట, ఉత్తచాట'

'ఉట్టి మీది కూడు, ఊరు మీద నివర్ర'

B హల్లులన్నింటికి వ్వర మైత్రి కలదు.

'క-కా' లకు యతి

'కందిత్తుకు సమరు లేదు, కాపోవికి సెనరు లేదు'

'కడుపులో లేంది, కాపలించుకుంటే వస్తాది'

'కు-కూ'లకు యతి

'కుక్కకు పనిలేను, కూచుండ తీరదు'

కొ-కోలకు యతి

'కొడుకు బాగుండాలె, కోడలు ముండ మొయ్యాలె'

'గ-గ' లకు మైత్రి

'గడియ పురుసత్ లేదు, గవ్వరాకడలేదు'

'గో-గి' లకు మైత్రి

'గోకుడుకు, గీకుడు మందు'

'చ-చి' లకు మైత్రి

'చక్కనమ్మ. చిక్కినా అందమే'

'చె-చె' లకు మైత్రి

'చెప్పుకుంటె మానంబాయె, చెప్పకుంటె పాపంబాయె'

'జ-జా' లకు మైత్రి

'జనంమల్లో, జాతరమల్లో'

'త-త' లకు మైత్రి

'తల్లినన్న చూపెట్టు, తద్దిన మన్న పెట్టు'

'తె-తె' లకు మైత్రి

'తెగెదాక బలిచ్చెరా తెమగు కులం'

దో-దొ లకు మైత్రి

దోవిదయవల్ని, దొయ్య వారింది

## నియమ రహితమగు యతులు :

ఇ-క లకు మైత్రి-'ఇల్లు జానెడు, కర్రమూరెడు'

ఊ-ఇ లకు యతి-ఊళ్ళోనియ్యం, ఇంట్లో కయ్యం

ఒ-త లకు మైత్రి-ఒకడుపెద్దై అప్పడు, తనకున్నది ఎప్పుడు

చ-బ లకు మైత్రి-చదువు బారెడు, బలుపాలు దోసెడు

త-పి లకు మైత్రి-తర్పిదానం కాదు, పిల్లు టోవం కాదు

చి-మ లకు మైత్రి-చిత్తం శివునిమీద, మనసు మిందలమీద

ఈ విధమగు యతి స్వరూపము కూడా జానపదుల సామెత లందు కాన్పించు చున్నది.

## ప్రాసము :

'ప్రథమ పాద ద్వితీయాక్షంబు ప్రాస' అని సూత్రము. అనగా ప్రతి పాదమునందు, రెండవ అక్షరము ప్రాస అని తెలియుచున్నది. సామెతలందు.'యతి' కి వలనే ప్రాసకు కూడా అత్యధిక ప్రాధాన్యము కలదు. జానపదులు సామెతలను అలవోకగా సృష్టించినను వాని యందు అప్రయత్నముగా'ప్రాస'చోటు చేసుకొన్నది. ఇది 1) ప్రాస 2) ప్రాసయతి 3) రెండక్షరముల కన్న ఎక్కువమైత్రి 4) అంత్యప్రాస అను నాలుగు విధములుగా కనిపించుచున్నవి.

ప్రాసము :

పాద ద్వితీయాక్షరము ఇందు ప్రథమ పాదమున ప్రథమాక్షరము గురువైనచో దక్కిన పాదమున ప్రథమాక్షరములు గురువులే కావలయును. లఘువైనచో దక్కినవి లఘువులే కావలయునని నియమము.

'తినికక్కరాదు, కనిపోగొట్టుకోరాదు' 'గోకుడుకు, గీకుడే మందు'

'నోరు మంచిదైతే, ఊరు మంచిదైతది' 'రాజుల సంపాదన, గాజులపాలు'

ప్రాసయతి :

'యతికి మారు పాదద్వితీయాక్షరమును యతి స్థానము ప్రక్కన నిలిపి ప్రాస మైత్రిని గూర్చుట ప్రాసయతి'.

అత్తమీది కోపం, దుత్తమీద తీసె-ఉత్తరచూచి ఎత్తరగంప

రెండుక్షరముల కన్న ఎక్కువ :

కొన్ని సామెతలందు రెండుక్షరముల కన్న ఎక్కువగా ప్రాసమైత్రి కన్పించుచున్నది.

రాసుకుంటె రంగం కాదు, పూసుకుంటె పుణ్యంరాదు

ఏపాటు తప్పినా, సాపాటు తప్పదు

కాటికాడ ఉన్నోమాటలు, కూటికాడరావు

ఇ సామెతల యందు 'త్ర్యక్షరప్రాసము' కన్పించుచున్నది.

అంత్య ప్రాసము :

పాదాంతమునందు గల అక్షరముల మైత్రి, కొన్ని సామెతలందు, రెండు మూడు అక్షరములతో కూడ 'మైత్రి' గలదు.

చట్టమై వచ్చింది, దయ్యమై పట్టింది-తిండి తిమ్మరాజు, పనికి పోతురాజు
చేసేటివి పాపాలు, పెట్టేటివి దీపాలు-తర్పిదానం కాదు, పొల్లు బోనంకాదు'
చెల్లని రూపాయికి గీత లెక్కువ, దాతకానోనికి మాట లెక్కువ

అలంకారములు :

భాషకు సౌందర్య హేతువులు అలంకారములు సామెతలందు అలంకారములకు ప్రాముఖ్యత గలదు. 'లోకోక్తి' అను పేర ఒక అలంకారము ఉండుట వలన, సామెతలకు అలంకారములతో గల సాన్నిహిత్యము తెలియుచున్నది.

జానపదుల సామెతలందు, మనము కొన్ని అలంకారములను గమనింప వచ్చును. జానపదులు వానిని అ ప్రయత్నముగా అల్లుకొనినవి. వీనిలో స్వభావోక్తి దృష్టాంత, అప్రస్తుత ప్రశంస, విదర్శనము వంటి అలంకార ఛాయలు కాన్పించు చున్నవి.

స్వభావోక్తి :

'ఉన్నదున్నట్లు స్వభావ చిత్రణ చేసినచో అది స్వభావోక్తి అందురు.' ఒక దాని యొక్క అసాధారణ వర్ణనం స్వభావోక్తి వీనిలో జాతి క్రియ గుణ ద్రవ్య స్వభావోక్తి అని నాలుగు విధములు కలవు.

జాతి స్వభావోక్తి :

'కోమటి కులం, పైసకు తులం'-'కందిత్తుకు పసరులేదు, కపోనికి సెనరులేదు'

గుణ స్వభావోక్తి :

'చేతికి గడియారం, ఇంట్లో పొడికారం'-'చూచి రమ్మంటే, కాల్చొచ్చింది'

## విషమాలంకారము :

సమము కానిది విషమము విరుద్ధములగు రెండు వస్తువుల నొకచో గూర్చినచో విషమము అందురు.—'ఇచ్చుకునేటోండ్లు ఈగ తిరుగ, పుచ్చుకునేటోండ్లు పులితిరుగ'

## సమాలంకారము :

'పరస్పరానుకూల వస్తువుల సంబంధము వర్ణించినచో సమాలంకారము' అందురు.—'గంతకుదగ్గ బొంత'

## అతిశయోక్తి :

'ఉపమేయమునదఃకించి ఉపమానము మాత్రమే చెప్పట అతిశయోక్తి' అనబడును.—'అయ్యగారికి ఆరెడ్లు, మూడు దొడ్లు'

## తుల్యయోగిత :

'కేవల ప్రాకృతములకును' కేవలా ప్రాకృతములకును గమ్య మానమగు నౌపమ్యముచే దుల్యభావము చెప్పిన తుల్యయోగిత' అనబడును.
'అపతి మొక్కులు, సంపతి విడుపులు'

## దీపకము :

'ఏకవాక్యతతో కూడి యుండి ప్రాకృతా ప్రాకృతములగు ధర్మసామ్యము స్ఫురింపవలెను.—'కయ్యానికైనా వియ్యానికైనా సమానముండాలే'

## దృష్టాంతము :

'రెండు వాక్యములందు సామాన్యధర్మము బింబ ప్రతిబింబ రూపమున చెప్ప బడినచో దృష్టాంతము.—ఊరుకు చేసిన ఉపకారం, పీనుక్కు చేసిన శృంగారం, 'ఎద్దులేని సేద్యం, చద్ది లేని పయనం'—'ఎరువులేని సైరు, పరువులేని ఊరు'

## విదర్శనము :

"ఉపమాన ధర్మము నుపమేయమునకు చెప్పుట వలన అన్వయము కుదురక పోవుట వలన నెచట బింబ ప్రతిబింబ భావము గలదో దానిని విదర్శన మందురు."

అప్పు ఆదాకాదు, వాపు బలుపు కాదు–ఉట్టి మీది కూడు, ఊరు మీద నిద్ర

ఇల్లు తీరు వాకిలి, తల్లి తీరు పిల్ల

## అప్రస్తుతప్రశంస :

'అప్రస్తుతవస్తు వర్ణనముచే ప్రస్తుతవస్తువు గమ్యమానమయినచో నది అప్రస్తుత ప్రశంస అనబడును.' 'గాముగులున్నది, గంకెదేపాయే'

'చూచి రమ్మంటె, కాల్చొచ్చిండు'

## కారణమాల :

'ఒలిఫలపంక్తి కారణమాల' అందురు.

'కసవులేనిదే పశువులేదు, పశువులేనిదే పెంటలేదు, పెంటలేనిదే పంటలేదు'

## ఉపమాలంకారము :

'ఉపమానో ఉపమేయముల మధ్య సాదృశ్యము ఉండుట ఉపమ' అనబడును.

'ఎండల్ల ఏకులు వడికి, వానల్ల వడ్లదంచినట్లు'

'ఎంతైనా పరాయి సొమ్ము పరమాన్న మన్నట్లు'

'కూరలేని తిండి, కుక్కతిండి'–'పదిమందిలో చావు, పెండ్లితో సమానం'

జానపదుల సామెతలను భాషా విషయమున పరిశీలించిన ఎన్నియో విశేషములు కాన్పించును. వీనిలో ధ్వనుల మార్పు, దేశ్య, అన్యదేశ్య పదజాలము, సహజ మాండలికశైలి,స్వతంత్రముగా సృష్టించుకొనిన పదములు ఎన్నియో గుర్తింపవచ్చును.

# A ధ్వనుల మార్పు

i అచ్చులు :

అ = ఎ - లాగ = లాగె
ఇ = ఉ - ఇసుక = ఉసుక

ii హల్లులు :

గ = క - సెగ = సెక
చ = స - చావు = సావు
ద = ణ - పదకు = వణకు
వ = వ - పాయె = వాయె
ష = స - వేషం = వేసం
ణ = న - ప్రాణం = పానం

పదాది 'య' కారము :

ఇల్లు = యిల్లు
ఈగ = యీగ

పదాది 'వ' కారము :

ఊరు = వూరు, ఒక్క = వొక్క

సంయుక్తాక్షరములు ఉచ్చరింపలేక ఒక హల్లును దిగ విడుచుట కాన్పించును.

స్వాతి = సాతి
ప్రాకుడు = పాకుడు

హ్రస్వము దీర్ఘ మగుట :

పెండ్లము = పెండ్లాము

సంయుక్తాక్షరములు లేనివానికి సంయుక్తాక్షరములుచేర్చి పలుకుట గలదు.

బేరం = బ్యారం

**వర్ణ వ్యత్యయము :**

ఉచ్చారణము నందలి తడబాటు వలన ముందక్షరము వెనుకకును,వెనుకక్షరము ముందునకును చేరును.

పగులుట = పలుగుట

**అచ్చులోపము :**

రెండు హల్లుల నడుమగల అచ్చులోపము.

వలదు = వద్దు
కలపి = కల్పి

**లోపపూర్ణత :**

దీర్ఘము లోపించి హ్రస్వముగా మారుటచే ప్రక్కనున్న హల్లు ద్విత్వమగును.

దూడ = దుడ్డె

ఈ విధముగా జానపదుల సామెతల యందు కొన్ని విశేషములు కన్పించు చున్నవి.

## B దేశ్య పదములు

జానపదుల భాష దేశియమైనది. వారి పదములందు చాల వరకు ప్రత్యేకమగు మడికారము సొంపు స్పష్టమగుచుండును.

గోచి, వీపు, పెండ్లాం, నోము, పోగు, కొంప, మలక, గడ్డి, దొంతుల, గతుకు, ఎడ్లు, తప్పడు, పొత్తు, మొగడు, గంప, తంపు, దొడ్డి, మంద, కాటి, వంటి పదములెన్నియో జానపదుల సామెతలందు కన్పించుచున్నవి.

## C అన్య దేశ్యములు

భాషా విశాలతకు అన్యదేశ్యపదజాలము ఎంతేని తోడ్పడును. వాని ప్రవేశము ప్రతి భాష యందు తప్పని సరి.జానపదుల సామెతలయందు అన్యదేశ్య పదజాలము గుర్తింపవచ్చును.

ఉర్దూ పదములు–హిందీ పదములు :

నవాబు–నజర్ : 'నవాబుకు నజర్ లేదు, నా కెదురులేదు'
సీయత్, బర్కత్ : 'సీయతెంతో, బర్కతంత'
పురసత్ : 'గడియ పురసత్ లేదు, గవ్వరాకడలేదు'
పాందాన్ : 'తాను బుక్క తౌడు లేదు గని, లంజకు పాందాన్'
తమామ్ : తామామ్ లేనోనికి, తవుదే గాసం

తమిళ పదములు :

తైరు : మతిల మన్నుపడ మామగారికి మజ్జిగుంచితి, నేను తైరుంచికొంటి
సాంబారు : సాంబారు తాగంగ సంతోషమేగని, సంసారంచేయంగా ఎంతో వేషం

మరాఠీ పదము :

పటేల్ : ఇమర్మలేని పటేల్, ఊపంత పలగ్గొట్టిండు

## D మాండలిక పదజాలము

నేను ఈ పరిశోధనమున స్వీకరించిన జానపదుల సామెతలన్నియు తెలంగాణ ప్రాంత మండలి జనపదములందు సేకరించినవి. వీనిలో ఇచ్చటి ప్రాంతీయ భాషలోని సౌందర్యము గనునింప వచ్చును.

| | | |
|---|---|---|
| డిత్త–చిన్న కడవ | తూటు–రంధ్రము | సోపతి–స్నేహము |
| తాడ–చోట | ఇసంత–ఇటువైపు | దేకుట–జరుగుట |
| అగడు–అతురత | పీనుగు–శవము | లగ్గం–వివాహము |
| దూప–దాహము | రౌతు–రాయి | కొలువు–ఉద్యోగము |
| గుల్ల–గంప | దొబ్బడం–నెట్టుట | పాను–మురికి |
| | బువ్వ–అన్నము | అక్కెర–అవసరము |

ఈ ప్రకరణమున జానపదుల సామెతలను జాతీయములతోను, మరియు శిష్టుల వ్యవహారమున గల సామెతలతోను, గల భేదసాదృశ్యములు చూపబడినవి. జానపదుల సామెతలందు గల యతి ప్రాసములను, అలంకారములను, ధ్వనుల మార్పులను, దేశ్య, అన్యదేశ్య పదజాలమును, జానపదుల మాండలిక పదములను గురించి ఉదాహరణ పూర్వకముగా, సంక్షిప్తముగా వివరించితిని.

# "అధోజ్ఞాపికలు"

## ఉపక్రమణిక

1 తెలుగు జానపద గేయగాథలు — డా॥ నాయని కృష్ణకుమారి

2 హిందీ ఔర్ తెలుగు కహావతోంకా తులనాత్మక్ అధ్యయన్

3 ,, ,, — డా॥ ఎస్. ఎస్. దక్షిణామూర్తి

4 పసిడి పలుకులు — నేదునూరి గంగాధరం

5, 6, 7, 8, తెలుగు సామెతలు — (తెలుగు అకాడమి)

9 తెలుగు సామెతలు — (తెలుగు స్వతంత్ర-1954)

10 జానపద సాహిత్య స్వరూపము — డా॥ ఆర్. వి. యస్. సుందరం

11 బీహారీ ప్రావర్బ్స్ — జాన్ క్రిస్టియన్

12 ఎన్, అవుట్‌లైన్ ఆఫ్ ఇండియన్ ఫోక్‌లోర్ — డా॥ దుర్గా భగవత్

13 తెలుగు సామెతలు — (తెలుగు అకాడమి)

14 బీహారీ ప్రావర్బ్స్ — జాన్ క్రిస్టియన్

15 ,, ,,

16 జానపద సాహిత్య స్వరూపము — డా॥ ఆర్.వి.ఎస్. సుందరం

17 తెలుగు సామెతలు (వ్యాసం) — (తెలుగు స్వతంత్ర-1954)

18 హిందీ ఔర్ తెలుగు కహావతోంకా తులనాత్మక్ అధ్యయన్
డా॥ ఎస్. ఎస్. దక్షిణామూర్తి

19 సామెతలు (వ్యాసం) — అభ్యుదయ-డిసెంబర్ 1948

20 ,, ,,

# సాంఘిక జీవనము

1, 2, సామాజిక శాస్త్రము — ఇంఠవల్లి బాలేందు శేఖరం

3 Groups we mean any collection of human beings who are brought in the social relation ship with another — Societs By R M Maciver, CH. page

4 Societs are made up not only Indivivls but also groups — Society R. M. Maciver & CH. page

5 In a society people arrange themselves in groups families, villagers, class, professional assosiations — Society.

6 Man is a social Animal. — Aristatle

7 Man is dependent on society for protection, comport nature, education, equipment opportaunity and the multitude of definite services which society provids — Society.

8 'Wherever their life there is society' — Society. R M. Machiver & CH. page

9 Society.

10 ఆంధ్రుల సాంఘిక చరిత్ర – సురవరం ప్రతాపరెడ్డి

11 సూక్తిముక్తావళి-మషిధర జగన్మోహనరావు

12 The looks upon marriage is not only a very importent social institution, but an evually important religion institution. — Principles of Hindu Ethics By. Maganlal A Buch

13 దర్శనములు-మతములు-విజ్ఞాన సర్వస్వము

14 ,, ,,

15 Her status in the vedic period was sufficiently high she was the preciding deity of the house–principles of Hindu Ethics by. Maganlal A. Buch ,,

16 చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణ కర్మ విభాగ శః—గీత

17 బ్రాహ్మణోస్య ముఖ మాసీ । ద్బాహూరాజన్యః కృతః
ఊరూ తదస్యయద్వైశ్యః । పద్భ్యాం శూద్రో అజాయతః

పురుష సూక్తము

18 Society — R.M. Maciver & CH. page

19 రాజకీయతత్వం G.C. కొండయ్య

20 *The Brahamins represent the face of Deity that in* the head of society — Religion By. K. Dunlop

21 *Religion mearly confessious of faith Religion*
By K. Dunlop

22, 23, 24 (దర్శనములు_మతములు) విజ్ఞాన సర్వస్వము_7 సంపుటము

25, 26 సామాజిక శాస్త్రం అందవల్లి బాలేందు శేఖరం

27 దర్శనములు_మతములు_విజ్ఞాన సర్వస్వము 7వ సంపుటము

28 " "

29 రాజకీయతత్త్వం జి. సి. కొండయ్య

30 Custom serves well enough to regulate the conduct of life. — *Society By. R.M. Maciver & CH. page*

31 *Habits creats customs, customs create habits.*

32 Habits also precdee customs — Society

33 మత మతములు_సంప్రదాయములు డా॥ పి. రామచంద్రుడు

34 దర్శనములు_మతములు (విజ్ఞాన సర్వస్వము_ఏడవ సంపుటము)

35 " "

36 It is generally admitted that *belief in-fluences* behavior. Religion K. Dunlop

37 హరిణాపి హరేణాపి । బ్రహ్మణాపి సురైరపి ।
లలాట లిఖితా రేఖా । పరి మార్జన శక్యతే । — గీత

38, 39 స్మృతి వాఙ్మయము (విజ్ఞాన సర్వస్వము అరవ సంపుటము)

40 వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణాన్య
న్యాని సంయాతి నవాని దేహీ — గీత

41 A person who believes that some aspet or appurtence of a person survices death usually believes in another world — Religion. K. Dunlop

## క థ లు

42 బాలమిత్ర నవంబర్ 1977

## భా షా వి శే షాం శ ము లు

43 పసిడిపలుకులు నేదునూరి గంగాధరం

44 జానపద సాహిత్య స్వరూపం డా॥ ఆర్.వి.యస్. సుందరం

45 అవ్యక్తపీయభావవ్రకాశిక రావూరి దొరస్వామి

# ఉపయుక్త గ్రంథ సూచిక

## తెలుగు :

| | | |
|---|---|---|
| 1 | ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము | 4,6, సంపుటములు విద్వాన్ |
| 2 | ఆంధ్ర భాషా వికాసము | గంటి సోమయాజి |
| 3 | అప్పకవీయ భావ ప్రకాశిక | రావూరి దొరస్వామిశర్మ |
| 4 | ఆంధ్రుల సాంఘిక చరిత్ర | సురవరం ప్రతాపరెడ్డి |
| 5 | కావ్యాలంకార సంగ్రహము-ఆంధ్రీకరణము | సన్నిధానం-సూర్యనారాయణశాస్త్రి |
| 6 | జానపదగేయ సాహిత్యము | డా॥ బి. రామరాజు |
| 7 | జానపదగేయ గాథలు | శ్రీమతి డా॥ నాయని కృష్ణకుమారి |
| 8 | తెలుగు సామెతలు | I,II, ముద్రణలు, తెలుగు అకాదమీ |
| 9 | పసిడి పలుకులు | నేదునూరి గంగాధరం |
| 10 | ప్రజాసూక్తం | యువ భారతి ప్రచురణ |
| 11 | లోకోక్తిముక్తావళి | విద్వాన్ పి. కృష్ణమూర్తి |
| 12 | సంస్కృతలోకోక్తులు | శ్రీ చిలుకూరి నారాయణరావు |
| 13 | సూక్తిముక్తావళి | మహీధర జగన్మోహనరావు |
| 14 | పాటి సామెతలు | వేదధ్వోడ ప్రభుతులు |
| 15 | సామాజిక శాస్త్రం | ........... అంతవల్లి బాలేందు శేఖరం |
| 16 | జానపద సాహిత్య స్వరూపము | డా॥ ఆర్.వి.యస్. సుందరం |



ఆంగ్లము :


1 An out line of Indian Folklore — Durgha Bhagwat

2 Bihari proverbs — John Christian

3 Folklore and Folk life — Richard M. Dorson

4 Principles of Hindu Ethics — Maganlal A. Buch

5 Religion its functions in human life — Knight Dunlop

6 The study of Folklore — Alan Dundes

7 Society — R.M. Maciver & CH. page


హిందీ :


1 "హిందీ ఔర్ తెలుగు కహావతోంకా తులనాత్మక్ అధ్యయన్"
డా॥ యస్. యస్. దక్షిణామూర్తి


